నంఖ్యలో వున్నారు. ముస్లిమ్‌లు పట్టణ ప్రాంతాల్లో అసంఘటితరంగంలో పెద్ద సంఖ్యలో (8%) వున్నారు.

సాంప్రదాయపు అడ్డుగోడలు, ముస్లిం మహిళలకు సంకెళ్ళుగా మారాయ్. దీంతో ఇంటి బయటకు వచ్చి పని చేసే పరిధి కూడా తగ్గిపోతుంది. దళారీల ద్వారా పనినిపొంది ఇంట్లో పని చెయ్యడం వల్ల, బేరమాడే శక్తిని కోల్పోతూవుంది. పట్టణ ప్రాంతాల్లో ఆడ, మగకు సంబంధించి, ఎవరెవరు ఏ ఏ వృత్తుల్లో ఎక్కువగా వున్నారో ఈ క్రింది అంశాలు తెలియజేస్తున్నవి.

1. వర్తకులు మరియు దుకాణదారులు (పట్టణ ప్రాంతాల్లో ప్రత్యేంగా మగవారికే)

2. వస్తువులు అమ్మేవారు షాపుల్లో అసిస్టెంటులు (పట్టణ ప్రాంతాల్లో మగవారు)

3. టైలర్స్, డ్రస్సులు మరియు దానికి సంబంధించినవి కుట్టేవాళ్లు (పట్టణ ప్రాంతాల్లో ఆడవాళ్ళు)

4. రవాణా సౌకర్యాలు నిర్వహించువారు (పట్టణ ప్రాంతాల్లో మగవారు)

5. పొగాకు తయారీ మరియు పొగాకుకు సంబంధించిన ఉత్పత్తులు (పట్టణ ప్రాంతాల్లో ఆడవారు)

6. నూలు వడికేవారు, నేసేవారు, అల్లేవారు, రంగులు అద్దేవారు (మగవారు)

7. మిషన్లు బిగించడం, అమర్చడం, పనిముట్లు తయారు చెయ్యడం (మగవారు)

మొత్తం మీద భారతదేశ వ్యాప్తంగా చదువు, ఉపాధి, ఆరోగ్యం, పనిలో భాగస్వామ్యం, ఆర్థిక పరిస్థితి మొదలగు అన్ని అంశాలను పరిశీలించినా, ముస్లిమ్‌లు ముఖ్యంగా స్త్రీల పరిస్థితి ఇంకా దారుణంగా వుంది. ముస్లిమ్‌ల అభివృద్ధికి ప్రత్యేక చర్యలు చేపట్టాల్సివుంది.

*(సంక్షిప్త అనువాదం లలితా జోషి)*





# ప్రగతి పథంలో ప్రజాచైనా

**బలం పుంజుకుంటున్న ఆర్థిక వ్యవస్థ**
**10.7 శాతం పెరిగిన జిడిపి**
**24.3 శాతం పెరిగిన రెవెన్యూ**
**వ్యవసాయంపై ప్రత్యేక శ్రద్ధ, పెరిగిన వరి ఉత్పత్తి**

చైనా ఆర్థిక వ్యవస్థ ఏడాదికేడాది వేగంగా పురోగమిస్తుంది. 2006 జాతీయ ఆర్థిక, సామాజిక అభివృద్ధి పథకం అమలు, 2007 ముసాయిదా అభివృద్ధి పథకాన్ని చైనా జాతీయ అభివృద్ధి, సంస్కరణల కమీషన్ (ఎన్‌డిఆర్‌సి) ఇటీవల చైనా పీపుల్స్ కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టింది. 2007 రక్షణ బడ్జెట్‌ను 17.8 శాతం పెంచారు. విద్య, ఆరోగ్యానికి కేటాయింపులు బాగా పెంచారు. గత సంవత్సరం చైనా స్థూల జాతీయోత్పత్తి 20.94 లక్షల కోట్ల యువాన్లకు చేరుకుంది. ఇది గత సంవత్సరం కంటే 10.7 శాతం ఎక్కువ. మొత్తం ప్రభుత్వ రెవెన్యూ 2006లో 3.93 లక్షల కోట్ల యువాన్లు ఉంది. ఇది అంతకు ముందు సంవత్సరం కంటే 24.3 శాతం ఎక్కువ. మొత్తంగా వ్యవసాయ పన్నులను దేశవ్యాప్తంగా రద్దు చేశారు. వ్యవసాయం, గ్రామీణ ప్రాంతాలు, రైతులపై కేంద్ర ప్రభుత్వం మొత్తం 33,970 కోట్ల యువాన్లు ఖర్చు చేసింది. ఇది గత సంవత్సరం కంటే 4,220 కోట్ల యువాన్లు ఎక్కువ. వరి పంట ఉత్పత్తి 48,745 కోట్ల కిలోగ్రాములు వచ్చింది. ఇది గత సంవత్సరం కంటే 1,344 కోట్ల కిలోలు ఎక్కువ. గ్రామీణ ప్రాంతాల్లో ప్రవేశపెట్టిన నిర్బంధవిద్య వల్ల 5.2 కోట్ల మందికి ప్రయోజనం కలిగింది. నూతన గ్రామీణ సహకార వైద్య రక్షణ విధానం మొత్తం 41 కోట్ల మందికి అందుబాట్లోకి వచ్చింది. గ్రామీణుల, పట్టణవాసుల తలసరి నికర ఆదాయం వరుసగా 7.4 శాతం, 10.4 శాతంగా ఉంది.

**2007 లక్ష్యాలు:**

- 8 శాతం స్థూల జాతీయోత్పత్తి వృద్ధి సాధించడం.
- ప్రభుత్వ రెవెన్యూను 4,4065 లక్షల కోట్ల యువాన్లకు పెంచడం.
- పట్టణ ప్రజలకు కనీసం 90 లక్షల కొత్త ఉద్యోగాలు కల్పించడం.
- తలసరి నికర ఆదాయాన్ని 6 శాతం పెంచడం.
- వినియోగ వస్తువుల రిటైల్ అమ్మకాలను 12 శాతం పెంచడం.
- శాస్త్ర, సాంకేతిక రంగం, విద్య, వైద్యం, సాంస్కృతిక, ఇతర సామాజిక కార్యాక్రమాలను నిరంతరాయంగా కొనసాగించడం. పరిశోధన, అభివృద్ధి వ్యయాలను 1.56 శాతానికి పెంచడం.



# పొద్దంతా మిర్చి ఘాటుతో

– టి. జ్యోతి

భగ భగ మండుతున్న ఎండలు. ఎండతో పోటీపడి చకచకా చేతులాడిస్తూ, ఎ(ర్రటి మిర్చి తొడిమలు తీస్తున్న మహిళా కార్మికులు. తాము రావడంతో పాటు, పిల్లలను కూడ తోడు తెచ్చుకొని, ఎవరెక్కువ తొడిమలు తీస్తారో? అని పోటిపడి మరీ పని చేస్తున్నారు. మహిళలు చేసే పని పనితో పాటు, మిర్చి ఘాటుకు ఖణ, ఖణ మంటూ నిర్విరామంగా దగ్గు కూడా వారి వెన్నెంటే సాగుతూవుంది. ఎవరా మహిళలు? వారికిస్తున్న వేతనం ఏంటీ? వారెదొర్కొంటున్న సమస్యలు ఏంటీ? తెలుసుకోవాలంటే, ఒక్కసారి వరంగల్లు పట్టణాన్ని సందర్శించాల్సిందే మరి!

ఎండాకాలం వచ్చిందంటే, వరంగల్లు పట్టణంలో 7 నుంచి 8 వేల మంది మహిళలకు మిర్చి తొడిమలు తీసే పని దొరుకుతుంది. ఈ పని సం॥లో 3 నుంచి 4 నెలల వరకు వుంటుంది. పట్టణంలో దాదాపుగా 20 కల్లాలు వున్నవి. ఒక్కో కల్లంలో దాదాపుగా 400 మంది మహిళలు పని చేస్తున్నారు. పెద్ద మిర్చికి కిలోకి 4 రూ॥లు; చిన్న మిర్చికి కిలోకి 7 రూ॥ చొప్పున కూలీ పొందుతున్నారు. ఎవరెన్ని కిలోలు తొడిమలు తియ్యగలిగితే, కిలో లెక్కన రేటు కట్టి కూలీ ఇస్తారు. పొద్దున 9 గం॥ల నుండి సాయంత్రం 7 గం॥ వరకు ఆ చేతులు ఎంత వేగంగా కదిలితే, అంతకూలి గిట్టుబాటు అవుతుంది. ఈ మిర్చి పొడి విదేశాలకు ఎగుమతి చేస్తారట.


మిర్చి తొడిమెలు తీస్తున్న మహిళలు

సేఠ్ (యజమాని) ఏర్పాటు చేసిన తడకలతో కూడిన పందిళ్లలో, ఒకరి (ప్రక్కన మరొకరు సందులేకుండా కూర్చొని మహిళలు మిర్చి తొడిమలు తీస్తున్నారు. కొద్దిగా లేట్‌వస్తే వారికి పందిరిలో జాగా దొరకదు. ఎండలో కూర్చొని పని చెయ్యాల్సిందే.

ఒక్కో కల్లంలో నలుగురు మహిళలు మిర్చి కుప్పలను ఎండకు బోస్తూ, ఎండలో కాళ్లతో ఏర్పుతూ తిరుగుతున్నారు. వీరు పొద్దున 7 గం॥లకు వచ్చి, రాత్రి 11 గం॥ల వరకు మళ్ళీ కుప్ప చేసేవరకు ఈ పనిలోనే వుంటారు. రోజుకు 100 రూ॥ కూలి. పనిని పర్యవేక్షించడానికి సేఠ్ కుదిర్చిన మేస్త్రీలు తనిఖీ చేస్తుంటారు.

పెద్దాపురం, మొగిలిచర్ల, పగిడిపల్లి, దేశాయిపేట, ధర్మవరం, కాశిబుగ్గ, ఖిల్లా వరంగల్లు, మొదలగు గ్రామాలు 10 కి.మీ. దూరం నుంచి ఆటోలలో వరంగల్లు పట్టణానికి పనికి వస్తున్నారు. రోజువారి వారు సంపాదించిన కూలీలో 10 రూ॥ల నుండి 15 రూ॥ల వరకు ఆటో కిరాయికే పోతూవుంది.

టి. జ్యోతి, రత్నమాల, రాణి, కోమలి, రాజమణి తదితరులు 20 మందితో కూడిన ఐద్వా ప్రతినిధి బృందం మిర్చి కల్లాలలో పర్యటించింది. మహిళా కార్మికులతో మాట్లాడింది ఐద్వా బృందం.

ఎ(ర్రటి ఎండలో, ఎ(ర్రటి మిర్చితో సహజీవనం చేస్తున్న మిర్చి మహిళా కార్మికుల పరిస్థితి అత్యంత దయనీయంగా వుంది. ఇంటి నుండి తెచ్చుకున్న నీళ్లబాటిల్ తప్పితే, పనిచేసే చోట ఎక్కుడా, గొంతు తడుపుకోవడానికి మంచినీరు లేదు. ఒక్కో కల్లంలో 400 మంది మహిళలు పని చేస్తున్నా మూత్రశాలలు లేవు. కాని ఆకలిమంట, పనులు దొరుకక పోవడం ఎంతకష్టమైన ఈ పని చెయ్యడానికి పురి కొల్పాయి. ఒక్కో మహిళను కదిలించినపుడు చెప్పిన కఠోర సత్యాలు వారి మాటల్లోనే...

***<u>అనుసూయ, 60 సం॥లు:-</u>*** "బిడ్డా! 12 ఏండ్ల నుంచి ఈ పని చేస్తున్న, కూసోని చేసేపని అని, కుటుంబానికింత ఆనరాగా వుంటుందని పనికి వత్తాన్నా, దినమంతా మిరపకాయలల్లో రాత్రికి నూనెరాని, స్నానం చేస్తేగాని ముద్ద నోట్లోకి పోదు" అని కళ్లనీళ్లు పెట్టుకుంది.

*<u>శారద 35 సం॥లు:-</u>* చేతిలో 2 సం॥రాల బిడ్డ. నా భర్త ఉప్పర్ పనికి పోతాడు. ఇచ్చిన నాడు ఇన్ని పైసలు ఇంట్లో ఇస్తాడు. లేదంటే తాగుడుకే పోస్తాడు. బిడ్డనెత్తుకొని ఈ పనికి వస్తున్నాను. నాతోపాటు, బిడ్డ ఈ ఘాటుకు అస్తమానం దగ్గుతూవుంటే నా తల్లిప్రాణం కొట్టుకుంటుంది. రేపు ఈ పనికి రావద్దు అనుకుంటాను. తెల్లారితే మామూలే. అక్కరమాది. "మా మీద మాకు కోపం వచ్చిన, సేఠ్ మీద కోపం వచ్చిన కాలేది మా పొట్టే" అని ఈ పని చెయ్యక విధిలేని పరిస్థితిని వివరించింది.

*<u>శాంతమ్మ 30 సం॥లు:-</u>* పొద్దున్నే వస్తే పందిరిలో జాగా దొరుకుతుంది. లేకపోతే ఎండలోనే పని. ఎక్కువ మంది పనికివస్తే సేఠ్ కూలి తగ్గిస్తాడు. పెద్ద మిర్చికి 4 రూ॥లు ఇచ్చేకూలి మందిని చూసి 3 రూ॥లు చేసిండు. ఎవ్వరు నోరు మెదపలేదు. ఏ ఒక్కరో అడిగినా, ఇష్టం వుంటే చెయ్యండి, లేకపోతే లేదు అంటున్నాడు" అంటూ తన వెతలు వెల్లబోసుకుంది.

ఇంతలో 18 సం॥ల యువతి స్వప్న ఆవేశంగా పరిగెత్తుకుంటూ వచ్చి, "అక్కా రిక్షాతోలేటోల్లకు, ఆటోతోలేటోల్లకు, బిల్డింగులు

కట్టేటోల్లకు, విస్తర్లు కుట్టేటోల్లకు, పేరుపేరునా అందరికి సంఘాలున్నవి. మరి మాకెందుకు లేదు. ఈ మేస్త్రీల తిట్లు మేము పడలేము. శ్రమ చేస్తున్నాము. కూలీ అడుగుతున్నాము. మమ్మల్ని తక్కువ చేసి హీనంగా ఎందుకు మాట్లాడాలె. చేసిన కష్టం, కాంట దగ్గరికి తూకానికి తీసుకెళ్ళితే కిలో 1 నుంచి 2 కిలోలు తగ్గుతున్నవి.

మేస్త్రీని ఎదిరించి ఎవరైనా మాట్లాడితే తెల్లారి వారికి పని ఇవ్వడు. పని భద్రత కావాలి. పని గంటలు నిర్ణయించాలి. సంఘం పెట్టుకొని, మా సభ్యులమే పనిని పర్యవేక్షించుకుంటాము" అని గలగలా మాట్లాడుతూ కుండ బద్దలు కొట్టింది.

6,7 కల్లాలు తిరిగాక, అంతటా కనీస సౌకర్యాలకు నోచుకొని మహిళ కార్మికుల దారుణ పరిస్థితి అద్దం పట్టినట్టు కన్పించింది.

తదుపరి ఐద్వా బృందం సేఠ్ ముత్తు లింగంను కలసి 400 మంది మహిళలు పని చేస్తున్న చోట, కనీస సౌకర్యాల సంగతి ప్రశ్నించగా, అది సాధ్యం కాదని తప్పించుకో జూసాడు. ఒక్కసారిగా ఐద్వా సభ్యులు ప్రశ్నలతో, మూకుమ్మడి దాడి చేయగా, వెంటనే వెదురు బద్దలు నాటి, తడికలతో మహిళలకు మరుగు సౌకర్యాలు కల్పిస్తానని హామి ఇచ్చాడు.

ఇదే విషయం అక్కడ పని చేస్తున్న మహిళలకు వివరించగా చెప్పలేనంత ఆనందం, ఐక్యంగా వుంటే సమస్యలు పరిష్కరించుకోవచ్చు. అనే విశ్వాసం స్పష్టంగా వారి ముఖాల్లో కన్పించింది. మహిళా కార్మికులతో చివరగా, సమస్యలు పరిష్కరించుకోవడానికి, పోరాటానికి సిద్ధమేనా? అని ప్రశ్నించగా, ముక్తకంఠంతో అందరూ, "మీరు ఎట్లా చెపితే అట్లా బిడ్డా" అన్నారు.

రాష్ట్రంలో కోటి మందిపైగా వున్న అ సంఘటిత రంగ కార్మికుల్లో, మిర్చి కార్మికులు కూడ భాగమే. పని భద్రత, కనీస వేతనాలు పని గంటలు లేక సతమతమవుతున్నారు. సమాజానికి సేవ నందిస్తున్న వారు కనీస వసతులు సౌకర్యాలు లేక అవమానాలు వేధింపులు మరియు ఎటువంటి కార్మిక చట్టాలు, వర్తించక మగ్గిపోతున్నారు. అందుకనే, మిర్చి తొడిమలు తీసే మహిళా కార్మికులను, సంఘటితపరిచి సమస్యలపై ఐక్యంగా కదిలించేందుకు మహిళా సంఘాలు, కార్మిక సంఘాలు సమాయత్తం కావాలి.

# రేపటి మహిళ

\- ఆగస్ట్ బెబెల్

**భ**విష్యత్ (సోషలిస్టు) సమాజంలోని మహిళ సాంఘికంగా, ఆర్థికంగా స్వతంత్రంగా ఉంటుంది. అవశేషప్రాయంగా మిగిలి ఉన్న ఆధిపత్యానికిగానీ, దోపిడీకిగానీ ఆమె ఇంకెంతోకాలం లోనుకాదు. ఆమె స్వేచ్ఛగానూ, పురుషునితో సమానంగానూ ఉంటుంది. తన విధికి తానే కర్తగా ఉంటుంది. శరీరకమైన తేడాలూ, తదనుగుణమైన అవసరాలరీత్యా కొన్ని మినహాయింపులున్నా ఆమె విద్యా వ్యాసంగం పురుషుని వలె ఉంటుంది. సహజ వాతావరణంలో జీవిస్తూ, అవసరాలకు కనుగుణంగా ఆమె తన శారీరక, మానసిక శక్తులనూ, వివేచననూ అభివృద్ధిపరచుకొని, వినియోగించుకోగల శక్తిని కలిగి ఉంటుంది. తన ఆకాంక్షలకూ, అభీష్టానికీ, ప్రతిభకూ సరిపడే రంగంలో ఆమె తన వృత్తిని ఎంచుకుంటుంది. పురుషునితో సమానమైన పని పరిస్థితులను అనుభవంలోకి తెచ్చుకుంటుంది. ఏదైనా ఒక పని అంటే శిక్షకురాలిగా, ఉపాధ్యాయినిగా లేదా నర్సుగా రోజులో కొన్ని గంటలు చేయవచ్చు. రోజులో మరికొంత సమయాన్ని కళాసాధనలో లేదా ఏవైనా శాస్త్రాంశాల అధ్యయనంలో గడపవచ్చు. మిగిలిన నాల్గవవంతు భాగాన్ని పాలనా సంబంధమైన వ్యహారాలకు వినియోగించవచ్చు. తన అభీష్టానికీ, సందర్భానికీ అనుగుణంగా అధ్యయనంలోనో, పనిలోనో గడపవచ్చు. ఇతర స్త్రీలతోనూ లేదా పురుషులతోనూ కలసి వినోద కాలక్షేపాలతో ఆనందించవచ్చు.

స్త్రీ కూడా పురుషునివలెనే తన ప్రేమను స్వేచ్ఛగానూ, నిరాటంకంగానూ వ్యక్తం చేస్తుంది. ఆకర్షించడం లేదా



ఆకర్షితురాలవటం, అదే విధంగా దాంపత్యబంధంలో అడుగిడటం మొదలైనవాటిని తన ఇష్ట ప్రకారమే చేస్తుంది. మినహా మరే యితర కారణాలూ ఉండవు. మధ్యయుగాల వరకు వివాహం స్వీయ ఒప్పందంగా ఉన్నట్లుగానే, ఈ ఒప్పందం కూడా మధ్యవర్తిత్వంతో నిమిత్తం లేని స్వీయ కట్టుబాటుగా ఉంటుంది. ఈ విషయంలో సోషలిజం కొత్తగా సృష్టించినదేమీ లేదు. సమాజంలో స్వంత ఆస్తి ఆధిపత్యం వహించటానికి పూర్వం ఏదైతే విశ్వవ్యాప్తంగా అమలులో ఉన్నదో దానినే, అత్యున్నత నాగరిక దశలో నూతన సామాజిక రూపాల పరిధిలో పునరుద్ధరించటం జరుగుతుంది.

తన సహజవాంఛలను సంతృప్తిపరుచుకోవడం అనేది ఇతరులను నొప్పించేదిగానూ, అసౌకర్యం కల్గించేదిగానూ ఉండకూడదన్న షరతుపై ఒక వ్యక్తి తన స్వీయావసరాలను తీర్చుకోవచ్చు. ఇతరేతరమైన సహజ వాంఛలను సంతృప్తిపరచు కొన్నట్లుగానే, లైంగిక వాంఛలను సంతృప్తిరచు కోవడం కూడా పూర్తిగా స్వంత వ్యవహారం. ఈ విషయంలో ఏ ఒక్కరూ ఇతరులకు జవాబుదారీకారు. అంతేకాక ఇందులో జోక్యం చేసుకొనే హక్కు, అయాచిత తీర్పులిచ్చే హక్కు ఎవరికీ ఉండదు. నేనేమీ తింటాను, ఏ విధంగా నేను తాగుతాను, నిద్రిస్తాను, దుస్తులు ధరిస్తాను అన్నవి పూర్తిగా నా స్వంత వ్యవహారం. అదేవిధంగా లింగభేదం కలిగిన వ్యవహారం. తెలివితేటలు, సంస్కృతి, సంపూర్ణమైన వ్యక్తి స్వాతంత్ర్యము (సహజంగానే ఈ గుణాలన్నీ విద్య, భవిష్యత్ సామాజిక పరిస్థితుల ఫలితంగా కలుగుతాయి) అనేవి ప్రతి ఒక్కరినీ, వారికి అసౌకర్యాన్ని కల్పించే చర్యలకు ఉపక్రమించకుండా కాపాడుతాయి. ప్రస్తుతం జీవిస్తున్న వారికంటే భవిష్యత్ సమాజంలోని స్త్రీ పురుషులు అత్యున్నతమైన స్వీయ క్రమ శిక్షణను, స్వీయ విజ్ఞానాన్ని కలిగి ఉంటారు. లైంగిక అంశాల చర్చలకు సంబంధించి అవివేకంతో కూడిన బిడియము, పరిహాసాస్పదమైన మొహమాటంతో కూడిన గుప్తత వైదొలగి స్త్రీ పురుషుల సంభోగం ఇప్పటికంటే మరింత సహజాతి సహజంగా ఉంటుంది. ఒకవేళ దాంపత్య బంధంలో ప్రవేశించిన ఇరువురి మధ్య పరస్పరం పొసగకపోయినా, లేదా అసంతృప్తి కలిగినా లేదా నిరాదరణ పెరిగినా అది అసహజమవుతుందని, కనుక ఇలాంటి అనైతిక బంధాన్ని రద్దుచేసుకోవాలని నైతిక ధర్మం కోరుతుంది. ఇప్పటివరకు ఉనికిలో వున్న పరిస్థితులు పలువురు స్త్రీలను బ్రహ్మచారిణిలుగానో లేదా తమ శరీరాలను కుదువపెట్టుకొనే వారిగానో మార్చివేశాయి. ఈ పరిస్థితులు తొలగిపోతే పురుషులు ఇంకెతోకాలం తమ ఆధిపత్యాన్ని నిలుపుకోలేరు. మరోవైపున మారిన సామాజిక పరిస్థితులు... ఇప్పటివరకు బహిర్గతం కాకుండా వున్న వైవాహిక జీవితంలోని ఆటంకాలనూ, అసౌకర్యాలనూ తొలగిస్తాయి.

**"ఆదివాసీల చారిత్రక పోరాటాలలో ప్రథమంగా పేర్కొనదగింది సమ్మక్క సారాలమ్మ పోరాటం. ఈ పోరాటానికి గుర్తింపుగా నేటికీ దేశంలోనే అతి పెద్ద జాతర జరగడం ముందుగా పేర్కొన్నాలి. ఆంగ్లేయ పరిపాలనా కాలంలో చేపట్టిన సంస్కరణల ఫలితంగా ఆదివాసీ ప్రజలపై పన్నుల వల్ల, వాటి వసూలు విధానం వల్ల చాలా పెద్ద తిరుగుబాట్లు జరిగాయి.**

నేటి మహిళ సామాజిక స్థానంలో ఆమెకు ఎదురవుతున్న ఆటంకాలూ, వైరుధ్యాలూ, అసహజాంశాలూ అంతకంతకూ పలువురి దృష్టికి ఎక్కుతున్నాయి. ఈ జాగృతి సామాజిక, కాల్పనిక సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నది. అయితే తరచుగా తలక్రిందుల రూపంలో వ్యక్తమవుతున్నది. ప్రస్తుత వివాహ రూపం తన ప్రయోజనం కోల్పోయి చివరి అంకంలో ఉంది. ఈ విషయాన్ని ఆలోచనాపరులెవరూ కాదనజాలరు. కనుకనే ప్రేమించటంలో స్వేచ్ఛ వుండాలని భావించేవారు ఉన్నారు. అలానే ఇప్పటికే ఉడిగిపోయిన సంబంధాలను రద్దుచేసుకోవాలనుకోవడం అత్యంత సహజం. అయితే ఇదే సమయంలో ప్రస్తుత సామాజిక వ్యవస్థను మార్చాల్సిన అవసరాన్ని వారు గుర్తించలేకపోతున్నారు. లైంగిక స్వేచ్ఛకు కేవలం సంపన్నవర్గాలు మాత్రమే అర్హులని వారు విశ్వసిస్తున్నారు.

బూర్జువా సమాజంలో ప్రేమ భావనను వ్యక్తం చేసే స్వేచ్ఛ ఉండదు. (ముస్ముందు ఈ విషయానికి వస్తాము) ఈ సమాజంలో ప్రజలందరినీ సాంఘిక, మేధోపరమైన ఉన్నత వర్గాల సామాజిక పరిస్థితులలోనే ఉంచగలిగితే అప్పుడు మొత్తం సమాజం ఉన్నత వార్గాలు అనుభవించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనే అందుకోగలుగుతుంది. తన భార్య అక్రమ సంబంధాల గురించి మరొకరి దగ్గర అభిప్రాయాన్ని ప్రకటించే భర్తను గురించి (రచయిత్రి) జార్జి శాండ్ 'జాక్వెస్' (రచనలో) ఇలా పేర్కొంది. "ప్రేమను ఏ ఒక్కరూ శాసించలేరు. ప్రేమానుభూతి కలగడం తప్పుకాదు, కలగకపోవడమూ తప్పుకాదు. స్త్రీని, పతితగా మార్చేది ఏదన్నదే అబద్ధం. నిజానికి తన ప్రియుడితో గడిపిన గంట సమయంలో ఆమె పతిత అవదు, తదనంతరం తన భర్తతో ఆమె గడిపిన రాత్రితో ఆమె పతితగా మారుతుంది''. తన అభిప్రాయాన్ని అనుసరించి జాక్వెస్ తన స్థానాన్ని తన ప్రత్యర్థికి విడిచిపెడతాడు. అలా చేయడంలో ఆయన కింది విధమైన తాత్విక ధోరణిని ప్రదర్శిస్తాడు. "నా స్థానంలో బోరెల్ వుంటే తన భార్యను కొట్టి వుండేవాడు. అంతలోనే ఆమెను తన చేతులోకి తీసుకొనేవాడు. ముద్దులతో ముంచెత్తేవాడు. తమపట్ల విశ్వాసంతోలేని భార్యలను ప్రాచ్యదేశాల పద్ధతిలో చంపివేసే పురుషులు ఉన్నారు. ఎందుకంటే భార్యను వారు తమ చట్టబద్ధమైన ఆస్తిగా పరిగణిస్తారు. కొందరేమో తమ ప్రత్యర్థితో పోట్లాటకు దిగుతారు. చంపివేస్తారు లేదా తరిమికొడతారు. ఆ తరువాత తను ప్రేమించినట్లుగా చెప్తున్న ఆ స్త్రీని ముద్దులిమ్మనీ, సుఖాన్నిమ్మనీ అడుగుతారు. అలాంటి స్థితిలో ఆ స్త్రీ భయంతో వెనుకడుగు వేసి ముడుచుకుపోవటమో, నిరాశతో లోబడటమో చేస్తుంది. దాంపత్య ప్రేమలో యీ పద్ధతి ఆమోదయోగ్యంగా పరిగణిస్తున్నారు. కాని నా దృష్టిలో అలాంటి మనుషుల కన్నా పందుల ప్రేమ తక్కువ హేయమైనదిగాను, తక్కువ మొరటైనదిగాను కన్పిస్తుంది." దీనిపై వ్యాఖానిస్తూ బ్రండేస్ ఇలా వ్రాశారు. "నేటి నాగరిక ప్రపంచంలో ప్రాథమికమైనవిగా భావించే ఈ సత్యాలు ఏభైయేళ్ళక్రితం నీచమైనవిగా పరిగణనకొచ్చేవి".

అయితే, "సంపన్న - సాంస్కృతిక ప్రపంచం", ఈనాటికీ జార్జి శాండ్ అభిప్రాయాలను ఆమోదించే సాహసాన్ని చేయలేకపోతున్నది. నిజ జీవితంలో వాటిని స్వీకరిస్తున్నప్పటికీ ఈ పరిస్థితి కొనసాగుతున్నది. నీతిసూత్రాలూ, మతబోధనల్లో మాదిరిగానే ఇది వివాహంలో కూడా రుజువర్తనను దెబ్బతీస్తుంది.

ఏదైతే నాడు గోథే, జార్జి శాండ్‌లు చేశారో ఈనాడు, వాళ్లతో ఏమాత్రం పోల్చటానికి వీలులేని వేలాది మంది దాన్నే ఆచరిస్తున్నారు. కాని వీళ్లకు సమాజంలో గౌరవప్రదమైన స్థానం. అది వుంటే మిగతావన్నీ వాటంతటికవే వస్తాయి. బూర్జువావర్గ దృష్టిలో గోథే, జార్జిశాండ్‌లు అనుభవించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనైతికమైనవి. ఎందుకంటే, సమాజం కల్పించినటువంటి, మన సామాజిక పరిస్థితుల స్వభావానికి పొసగనటువంటి నీతి శాసనాలకు వారు ఆచరించిన పద్ధత్తులు వ్యతిరేకమైనవి. బూర్జువా సమాజంలో పెద్దలు

నిర్ణయించిన వివాహాలు సర్వసాధారణం. లైంగిక సంబంధాలు ఇదొక్కటే 'నీతి మార్గం'. బూర్జువా ఆస్తి సంబంధాల ఫలితమే బూర్జువా వివాహం. దీనిని మనం తిరుగులేని విధంగా రుజువు చేయగలము.

స్వంత ఆస్తి, వారసత్వపు హక్కు మొదలైనవి ముందుకు రావడంతో ఈ వివాహ వ్యవస్థ వారసులుగా పుత్రులకు జన్మనిచ్చే కర్తవ్యంలోకి అడుగిడింది. ఇటువంటి సామాజిక పరిస్థితుల ఒత్తిడిలో వారసులకు ఇవ్వడానికి స్వంత ఆస్తి అంటూ ఏమీలేని వారిని కూడా ఈ వివాహ వ్యవస్థలోకి తీసుకువచ్చింది. దాంతో ఇదొక సామాజిక శాసనంగా మారింది. ఈ వివాహవ్యవస్థను ఉల్లంఘించే స్త్రీ, పురుషులను అక్రమసంబంధాలకు పాల్పడుతున్నారంటూ శాసనం జైళ్లపాలు చేస్తుంది.

**"గిరిజన తెగల గురించి మానవ శాస్త్రవేత్తలు ఎక్కువగా పరిశోధించారు. ఆ తదుపరి కొంతమంది వారి ఆచార వ్యవహారాలు, ఆర్థిక స్థితిగతుల గురించి అధ్యయనం చేశారు. ఈ తెగలలో లంబాడీలపైనే ఎక్కువ శాతం అధ్యయనాలు జరిగాయి. ఇతర గిరిజన భాషా సాహిత్యాలపై చాలా తక్కువగా పరిశోధనలు జరిగాయి"**

సోషలిస్టు సమాజంలో వారసులకు ఇవ్వడానికి ఏమీ ఉండదు... గృహ వినియోగ వస్తువులూ, ఇతర వాడుకునే వస్తువులూ మినహా. కనుక ఆ సమాజంలో ఆధునిక వివాహ రూపం కాలం చెల్లినదే అవుతుంది. ఆ విధంగా వారసత్వ సమస్య కూడా, ప్రత్యేకంగా దాన్ని రద్దుచేయకుండానే, పరిష్కారమయిపోతుంది. స్వంత ఆస్తి అంటూ ఒకసారి లేకుండాపోతే, ఇక వారసత్వపు హక్కే ఉండదు కదా! తద్వారా, స్త్రీలు స్వేచ్ఛను పొందుతారు. ఆమె సంతానం ఆమె స్వాతంత్ర్యాన్ని అరికట్టదు. ఆమె తన జీవితం నుంచి పొందగలానందాన్ని వారు మరింత అధికం చేస్తారు. అవసరమైనప్పుడు తల్లికి సహాయపడేందుకు నవ-యువతరానికి నర్సులు, ఉపాధ్యాయినులు, స్త్రీ స్నేహితులు అందుబాటులో ఉంటారు.

వివాహబంధం లేకుండా పోతున్నందుకు మనం ఏమీ ఆందోళన చెందనక్కరలేదు. లేదా 'ఆదర్శ రాజ్యం'లో మానవుడు స్వీయవినాశనం తెచ్చుకుంటున్నాడని గుండెలు బాదుకోనూ అక్కరలేదు. ఈ విషయంలో ఎఫ్. రాట్జెల్ రాసిన కింద విషయంలో మనం అంగీకరించాలి.

"ప్రకృతి సూత్రాలకు తాను మినహాయింపని మానవుడు ఎంతోకాలం భావించలేదు. చివరికతడు తన చర్యలకూ, ఆలోచనలకూ ఆధారమైన నియంత్రణకోసం అన్వేషణను ప్రారంభిస్తాడు. ప్రకృతి సూత్రాలకు అనుగుణ్యంగా తన జీవితాన్ని సాగిస్తాడు. కుటుంబమూ, రాజ్యమూ అనేవి శతాబ్ధాల నీతి సూత్రాలనుంచి పుట్టుకు రాలేదని, ప్రకృతి నుంచి పొందిన విజ్ఞానం యొక్క హేతుబద్ధ సూత్రాలకు అనుగుణంగా అవి ఉన్నాయన్న నిర్ణయానికి అతడు వస్తాడు. అవకాశం వున్న అన్ని మార్గాల నుండీ పోగుచేసుకొన్న రాజకీయాలూ, నీతి శాసన నియమాలూ అన్నీ కూడా ప్రకృతి సూత్రాలకు అనుగుణంగా నిశ్చయమైనట్లు గ్రహిస్తాడు. లక్షల సంవత్సరాలుగా మానవుడు కన్న కలలు వాస్తవ రూపం ధరించినట్లు అతడు తెలుసుకుంటాడు."

**"గిరిజనుల పరసరాలు సుందర మనోహర దృశాలు కావచ్చు. కాని వారి జీవితాలు అనునిత్య పోరాటాలు. అటు వేటకోసం క్రూర జంతువులతో పోరాటం. ఏ మత్రం సౌకర్యాలు లేని బతుకు. అంటురోగాలూ, పాత విశ్వాసాలూ, అనాది నమ్మకాలతో కాలం గడపడం సులువుకాదు"**

అటువంటి రోజు చాలా వేగంగా సమీపిస్తున్నది. మానవ సమాజం లక్షలాది సంవత్సరాల కాలక్రమంలో మునుపటి అభివృద్ధి దశలన్నిటినీ దాటుకుని చివరకు ప్రారంభమైన చోటువస్తోంది. అంటే కమ్యూనిస్టు ఆస్థి సంబంధాలకూ, సంపూర్ణ సమానత్వం వైపుకూ, సౌహార్ద్రతవైపుకూ పయనిస్తోంది. ఈ క్రమం కేవలం రక్తసంబంధీకులైన బంధుగణంలోనే కాకుండా మొత్తం మానవ సమాజంలో సంభవిస్తుంది. అది, మానవ సమాజంలో అటువంటి గొప్ప పురోగతిని తీసుకువస్తుంది. ప్రజల్లో స్వాతంత్ర్యాన్నీ, సమానత్వాన్నీ, సౌభ్రాతృత్వాన్ని స్థాపించడానికి బూర్జువా సమాజం కృషి చేస్తుందికాని దాని వల్లకాదు. బూర్జువా వర్గం చేతులెత్తేసిన ఈ లక్ష్యాన్ని సోషలిజం సాధించగలుగుతుంది. బూర్జువా సమాజం కేవలం సిద్ధాంతాలను మాత్రమే రూపొందిస్తుంది. ఇతరమైన అనేకానేక అంశాలవలెనే దాని ఆచరణ దాని సిద్ధాంతాలకు విరుద్ధంగా ఉంటుంది. సోషలిజం, సిద్ధాంతాన్నీ- ఆచరణనూ మిళితం చేస్తుంది.

ఇదిలా వుండగా మానవుడు తన అభివృద్ధి క్రమంలో బయలుదేరిన చోటకే తిరిగి వస్తాడు. అయితే ప్రారంభం నాటికన్నా ఇది సాంస్కృతికంగా అత్యున్నత స్థాయిలో ఉంటుంది. ఆదిమ సమాజంలోని గణాలలో ఉమ్మడి ఆస్తి ఉన్నది. అయితే ఇది, అభివృద్ధిపరంగా చూస్తే అతి తక్కువస్థాయిలో వున్న మొరటు రూపం, సామాజికాభివృద్ధి క్రమంలో ఉమ్మడి ఆస్తి తొలగిపోయింది. ఏవో కొన్ని అవశేషాలు మాత్రమే మిగిలాయి. గణాలు భగ్నమయ్యాయి. చివరకు మొత్తం సమాజం యాంత్రికమైపోయింది. ఇదే సమయంలో, అభివృద్ధి క్రమంలోని వివిధ దశలలో సమాజంలో ఉత్పాదక శక్తులు బ్రహ్మాండంగా పెరిగాయి. అవసరాలలో వైవిధ్యం చోటు చేసుకొన్నది. గణాలనుంచీ, తెగల నుంచీ దేశాలూ, బ్రహ్మాండమైన రాజ్యాలూ పుట్టుకువచ్చాయి. అదే సమయంలో రాజ్య వ్యవహారాలు, సామాజిక అవసరాలతో వైరుధ్యాన్ని కలిగి వున్నాయి. సంపదనూ, ఉత్పత్తి సాధనలనూ సాధ్యమైన మేరకు ఉమ్మడి ఆస్తిగా మార్చటం ద్వారా వైరుధ్యాలను పరిష్కరించటమే భవిష్యత్ కర్తవ్యం.

ఏవైతే ఒకప్పుడు తనవిగా ఉన్నాయో, వేటినైతే తాను సృజించిందో వాటిని ఒకసారి గాని సమాజం వెనుకకు తీసుకున్నట్లయితే, అప్పుడు సమాజ సభ్యులందరి జీవన ప్రమాణాలు అత్యున్నత సాంస్కృతిక స్థాయికి చేరతాయి. ఆదిమ పరిస్థితులలో వ్యక్తులకూ, వైయక్తిక వర్గాలకు ఏవైతే అందుబాటులో ఉన్నాయో అవన్నీ తిరిగి అందుబాటులోకి వస్తాయి. స్త్రీ విషయానికి వస్తే, ఆదిమ సమాజంలో పోషించిన క్రియాశీలక పాత్రను తిరిగి నిర్వహిస్తుంది. ఆధిపత్యంతో కూడినది కాక, పురుషునితో సమానమైన పాత్రను స్త్రీ పోషిస్తుంది.

రాజ్యాభివృద్ధి ముగింపు మానవ ఉనికి ప్రారంభాన్ని పోలి వుంటుంది. తొలినాటి సమానత్వం తిరిగి వస్తుంది. మానవ సమాజ చక్రం ప్రారంభమై ముగుస్తుంది" అని మాతృస్వామ్యం అన్న తన గ్రంథంలో బాకోఫెన్ చెపుతాడు.

ప్రాచీన సమాజం గురించి విశేష పరిశోధన చేసిన మోర్గాన్ ఈ విధంగా పేర్కొంటాడు. "నాగరికత ఏర్పడిన నాటినుండి ఆస్తి విపరీతంగా పెరిగింది. అనేక రూపాలు ధరించింది. దాని ఉపయోగాలు విస్తరించాయి. దాని స్వంత దారుల ప్రయోజనాలకోసం బహు తెలివిగా నిర్వహించడం వచ్చింది. చివరకు ప్రజలకు స్వాధీనం కాకుండాపోయింది. మానవ మేధతను సృష్టించిన దానిముందు తెల్లబోయి నిలుచుంది. అయితే మానవుని తెలివితేటలు, ఆస్తిపైన యాజమాన్యాన్ని సంపాదించే రోజు వస్తుంది. ఆస్తికీ, దానిని రక్షించే రాజ్యానికీ మధ్య సంబంధాలను, ఆస్తి యజమానుల బాధ్యతలనూ, వారికి గల హక్కుల పరిమితిని నిర్ణయించే రోజు వస్తుంది. వ్యక్తుల ప్రయోజనాలకంటే సమాజ ప్రయోజనాలు అధికమైనవి. వానిమధ్య న్యాయమైన సమన్వయంతో కూడిన అనుబంధాలను సృష్టించాలి. గతంలో లాగానే భవిష్యత్‌లో కూడా పురోగతి జరగాలంటే మానవుని భవితవ్యం, ఆస్తి సంపాదనతో ముడిపడి వుండకూడదు. నాగరికత ప్రారంభమైన తరువాత ఇప్పటివరకు గడచిన కాలం మానవ జాతి ఉనికిలో చాలా స్వల్పభాగం. రాబోయే కాలానికి పోలిస్తే మరీ స్వల్పం. ఆస్తి సంపాదనే మానవ జీవిత లక్ష్యము, గమ్యము అయ్యేటట్లయితే, సమాజం విధ్వంసం కావటం తథ్యం.

"ప్రభుత్వంలో ప్రజాస్వామ్యం, సమాజంలో సోదరభావం, హక్కుల విషయంలో సమానత్వం, సార్వత్రిక విద్య అన్నీ కలిసి రాబోయే ఉన్నత సమాజాన్ని సూచిస్తున్నాయి. మానవుని అనుభవం, మేధస్సు, విజ్ఞానమూ అటేదారి తీస్తున్నాయి.

"ప్రాచీన గణాలలోని స్వేచ్ఛా, సమానత్వం, సోదరభావం ఒక ఉన్నత రూపంలో పునరుజ్జీవనం పొందుతాయి."

ఆ విధంగా మానవులు తమ శాస్త్రీయ పరిశోధనలనూ, సారూప్య నిర్ధారణలనూ ప్రాతిపదికగా చేసుకొని విభిన్న దృక్పథాలకు ప్రాతినిధ్యం వహిస్తారు. స్త్రీ సంపూర్ణ విమోచన, పురుషునితో ఆమె సమానత్వమూ... ఈ రెండూ మన సాంస్కృతికాభివృద్ధికి తుది లక్ష్యాలు కావాలి. ఈ లక్ష్యాల సాధనను భూమిపైన ఏ శక్తీ అడ్డగించలేదు. ఒక మనిషిని మరో మనిషి, అదే విధంగా కార్మికునిపై పెట్టుబడిదారుడు పెత్తనం చేసే దౌర్భాగ్యాన్ని రద్దుచేసే మార్పుద్వారా మాత్రమే పై ఆశయం సిద్ధించగలదు. అప్పుడు మాత్రమే మానవాభివృద్ధి శిఖరస్థాయికి చేరుతుంది. మానవులు కలలుకనే ఆ "సువర్ణయుగం" చిట్టచివరగా వచ్చి తీరుతుంది. వర్గాధిపత్యానికి ఒక్కసారి శాశ్వతంగా స్వస్థిపలికామంటే దానితోపాటే స్త్రీపై పురుషుని పెత్తనానికి తెరపడుతుంది.

*ఆగస్ట్ బెబెల్ రాసిన ఉమన్ అండ్ సోషలిజం అను గ్రంథం నుండి*

*(అనువాదం: డిబిఎస్ఇహెచ్ఆర్ మూర్తి)*

## తరాలు మారినా... తలరాత మారలేదు!

**మహిళా ఉద్యోగులు పెరిగినా... వివక్ష తగ్గలేదు: ఐఎల్‌వో**

ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ఉద్యోగాలు చేసే మహిళల సంఖ్య పెరిగింది. అదే సమయంలో హోదా, గౌరవం, ఉద్యోగ భద్రత, వేతనాలు, విద్య తదితర అంశాల్లో మహిళలకు పురుషులకు మధ్య నిరంతరాయంగా తారతమ్యాలు కొనసాగుతున్నాయి" అని ఐరాసకు చెందిన అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్‌వో) ఓ నివేదికలో పేర్కొంది. అందులో "ఉద్యోగం చేస్తున్న లేదా అందుకు సిద్ధంగా ఉన్న మహిళల సంఖ్య గణనీయంగా పెరిగింది. 2006లో ప్రపంచవ్యాప్తంగా 290 కోట్ల మంది ఉద్యోగులు పనిచేస్తుండగా అందులో మహిళల సంఖ్య 120 కోట్లు. అయితే వారు తక్కువ ఉత్పాదకత, తక్కువ జీతాలొచ్చే ఉద్యోగాలే ఎక్కువగా చేస్తున్నారు. చేసేది ఒకే పనైనా పురుషుల కన్నా తక్కువ వేతనాలు పొందుతున్నారు. దీని వల్ల ఉద్యోగాలు చేస్తున్న మహిళలపై ఆధారపడే కుటుంబాలు ఇంకా దారిద్ర్యాన్ని ఎదుర్కొంటున్నాయి" అని పేర్కొన్నారు. మరోవైపు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో కీలక నిర్ణయాలు తీసుకునే వ్యవస్థల్లో మహిళల ప్రాతినిధ్యాన్ని పెంచాల్సిందిగా ఐరాస భద్రతా మండలి సభ్యదేశాలకు పిలుపునిచ్చింది.

## ప్రతి ఐదుగురిలో ఒకరు లైంగిక హింస బాధితులే:

"ప్రపంచంలోని ప్రతి ఐదుగురు అమ్మాయిల్లో ఒకరు లైంగిక హింస బారిన పడుతున్నారు. 15 ఏళ్ళ వయసు దాటక ముందే వాళ్ళు బాధితులుగా మారుతున్నారు" అని ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యూహెచ్‌లో) వెల్లడించింది. 'మహిళపై ఆమె సహచరుడు లైంగిక హింసకు పాల్పడటం దారుణం. అది ఆమె ఆరోగ్యంపై దుష్పరిణామాలకు దారితీస్తుంది. చిన్న వయసులో లైంగిక హింస బారినపడే వారు దీర్ఘకాలంలో తీవ్ర అనారోగ్యం పాలవుతున్నారు. మహిళలు అపరిచితుల కంటే కూడా సహచరులు, సన్నిహితుల నుంచే ఎక్కువగా అత్యాచారాలకు గురవుతున్నారన్నారు. స్త్రీలు సమాజానికి వెన్నెముక వంటివారని, అయితే వారి ఆరోగ్యానికి పలు దేశాలు తగు ప్రాధాన్యం ఇవ్వడంలేని ఆందోళన వ్యక్తం చేశారు. "మహిళలపై అత్యాచారాలను అరికట్టేందుకు ఐరాసతో సహా ఎవరూ పెద్దగా ఏమీ చేయడం లేదు. లైంగిక హింసను నేరంగా పరిగణించడంలో మనం విఫలమయ్యాం" అని సమితి ప్రధాన కార్యదర్శి బాన్ కీ మూన్ వ్యాఖ్యానించారు.

# దర్శి సుభద్రమ్మ

– డా॥ వకుళాభరణం లలిత

విద్యావంతురాలై, సామాజిక సేవా కార్యక్రమాల్లో అంకిత భావంతో కృషి చేసిన ఆదర్శవనిత దర్శిసుభద్రమ్మ. బాల్యం నుంచే సామాజిక సంబంధమైన, నైతిక విలువలుగల విషయాలను అధ్యయనం చేశారు. సాంఘిక విషయాల్లోనే గాక సంగీత, సాహిత్యాల్లోను, లలిత కళల్లోను ప్రవేశం గలవ్యక్తి.

గదర్‌పార్టీ సభ్యుడు, భారతస్వాతంత్ర్య సమర విప్లవ వీరుడైన దర్శి చెంచయ్య గారి అర్ధాంగి సుభద్రమ్మ. సంఘసంస్కరణ కార్యక్రమాల్లో భర్తతో సమానంగా పాలుపంచుకొన్న వ్యక్తి ఆమె. ఆమె పాటించే సూత్రాలు కాని, ఆమె దృక్పథం కాని ప్రత్యేకమైనవి. అవి ఆమె జీవన సరళినే కాదు, చెంచయ్య జీవితాన్ని కూడా మార్చి వేశాయి. ఆమె క్రమశిక్షణ, పట్టుదల, కార్యదీక్ష అనన్య సామాన్యాలు. ఆ క్రమ శిక్షణతోనే భర్త జీవితాన్ని చక్కగా తీర్చిదిద్దిన మహిళ ఆమె.

సాధారణంగా ఏ భర్త కూడా భార్య గుణగణాలను గూర్చి చెప్పరు. అయితే, దర్శి చెంచయ్యగారు తన స్వీయ చరిత్రలో ఆమెను గూర్చి రాసుకొన్నారు. దర్శి చెంచయ్య గారు ఉద్యమాల్లో క్రియాశీలక పాత్రను నిర్వహించారు. జాతీయోద్యమంలో పాల్గొని అనేక జైలు శిక్షలు అనుభవించారు. ఆ జాతీయ ఉద్యమమే దర్శిసుభద్రమ్మకు కూడా ఎంతో స్ఫూర్తి దాయకంగా ఉండింది.

సుభద్రమ్మగారికి గాంధీగారన్నా ఆయన అహింస, ప్రేమసిద్ధాంతాలన్నా ఎంతో యిష్టం. శాంతి అహింసలే సర్వమానవ కళ్యాణానికి నిలయాలనీ, ఆరెంటితోనే గాంధీ జాతీయోద్యమాన్ని మలచి, పెంపొందించారని ఆమె నమ్మారు.

జీవిత ప్రారంభం నుంచీ ఎన్నో ఈతి బాధలు, వాటికితోడు ఆర్థిక బాధలు చెంచయ్య దంపతులను వెంటాడుతూనే ఉన్నాయి. జీవిత ఆటుపోట్లల్లో ఆయనకు దన్నుగా నిల్చింది.

దర్శి సుభద్రమ్మ మహిళా సంఘాల్లో కృషి చేస్తూ, స్త్రీల అభ్యున్నతికి పాటుపడింది. సుభద్రమ్మ కృషి గూర్చి ఇంతవరకూ ఎవరూ ఎక్కడా పేర్కొక పోవటం దురదృష్టం. అనిబిసెంట్ సహచరిణిగా ఉంటూ, అఖిల భారత మహిళా సమాఖ్య కార్యక్రమాల్లో దక్షిణ భారత దేశంలో ఆమె చురుగ్గా పాల్గొన్నారు. అన్యాయానికి గురైన మహిళలకు అండగా నిలబడటంతో పాటు, స్త్రీలలో విద్యా వ్యాప్తికి ఎనలేని కృషి చేసారు. ఆర్థిక అసమానతలు, సామాజిక ఎత్తు పల్లాలను తొలగించి స్త్రీ జనోద్ధరణ దేశానికి ఆయువు పట్టుగా భావించి కృషి చేసిన దంపతులు వీరు.

స్త్రీలు, పురుషులవలెనే సమాన శక్తి సంపన్నులు అయితే, వారికి ప్రోత్సాహం ఇవ్వాలి. పురుషాధిక్య సమాజంలో వారిని అణచివేయడానికి పూనుకోక, వాళ్ళు చేసే పనులకు మద్ధతుయిచ్చినట్లైతే, వారి శక్తి సామర్థ్యాలు పెరిగి, ఎంతో ముందుకు చొచ్చుకొనిపోయి వ్యక్తిత్వాన్ని అభివృద్ధి పరచుకుంటారు. స్త్రీలలో ఉండేశక్తిని గుర్తించినప్పుడే వాళ్ళు సమాజంలో గౌరవాన్ని, ఆదరణను పొందగల్గుతారు. ప్రేమ, స్నేహం, గౌరవం, పరస్పర అవగాహన ఉన్నప్పుడే యిరువురూ కలసి క్రియాశీలక కార్యక్రమాలను చేయగల్గుతారు.



సుభద్రమ్మ జీవితంపై చిన్నప్పుడు జరిగిన సంఘటనలు కొన్ని ప్రగాఢమైన ముద్రవేశాయి. సుభద్రమ్మగారి పినతల్లి పిన్నవయస్సులోనే వితంతువు అయితే, కుటుంబ సభ్యులంతా కాలం చెల్లిన కఠిన సాంప్రదాయాల సంకెళ్లతో, ఛాందస భావాలతో ఆమె తల వెంట్రుకలు తీయాలని పట్టుపట్టారు. సుభద్రమ్మ విద్యార్థినిగా ఉన్నప్పుడే దాన్ని ప్రతి ఘటించి విజయాన్ని సాధించింది.

సుభద్రమ్మకు ఎప్పుడూ కులమత భేదాలపట్ల నమ్మకం లేదు. హరిజన సేవకు ఆమె అంకితురాలైనారు. ఎ. వెంకట సుబ్బయ్య (సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ) శ్రీ వి. భాష్యం అయ్యంగార్, సుభద్రమ్మ గారు కలసి ఒక హరిజన హాస్టలును స్థాపించారు. ఒక్కొక్క హరిజన బాలికకు 10 రూపాయల చొప్పున ప్రభుత్వ గ్రాంటును సంపాదించారు. ఆ హాస్టలుకే ప్రభుత్వం వారు భూవసతితో పాటు అన్ని రకాల సౌకర్యాలు కల్పించి అన్ని ఖర్చులతో నడిపి, అభివృద్ధిలోకి తెచ్చారు. ఈ దేశం అన్నమో రామచంద్రా! అనేవారిని సంపాధించి పెట్టింది? దేశం పురోగమించాలంటే స్త్రీలకు జరిగిన అన్యాయాన్ని గుర్తిస్తేనే, సమాజం పురోగామి ఔతుందని సుభద్రమ్మ భావించారు.

తన కుటుంబంలోని బిడ్డలను, మరదలి బిడ్డలను, మేనళ్ళులను కష్టపడి సుభద్రమ్మ చదివించారు. ఆమెకున్న కొన్ని భావాలు;

1) ఎంతవరకు చదువుకు అవకాశాలున్నాయో అంతవరకు చదివించాలి.

2) ఆర్థికంగా ఎవరి స్వార్జితం మీదవాళ్ళు ఆధారపడాలి.

3) దేశ పురోభివృద్ధి అంటే ఆర్థిక పురోభివృద్ధి ఒక్కటే కాదు. సంగీత, సాహిత్యాలు, విజ్ఞాన శాస్త్రాభివృద్ధి, అన్ని రకాల అభివృద్ధి ఉంటేనే దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతుందని ఆమె భావించారు.

4) లలిత కళలను అభ్యసించటం ప్రత్యేకంగా సాధ్యం కాదు కనుక, వాటిని పాఠ్యాంశాల్లో భాగంగా చేయటం మంచిదని అభిప్రాయపడ్డారు.

5) ప్రస్తుతం అమలులో / పరీక్షా విధానం సరైంది. / కాదని ఆమె అభిప్రాయపడ్డారు. సాంఘిక పరిస్థితుల్లో మార్పు తేవాలని ఆరాటపడ్డారు.

దర్శి సుభద్రమ్మ ఆదర్శవంతురాలైన గృహిణి. మానవత్వం గల వ్యక్తి. స్త్రీ స్వేచ్ఛ, సమానత్వాలు ఉంటేనే గాని దేశం బాగుపడదన్న సమతా భావంగల వ్యక్తి. సమాజంలో పేరుకు పోయిన ఛాందస భావాలను పోగొట్టాలని తపన బడవ్యక్తి, తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడ్డ వ్యక్తి ఆమె... కళావంతుల సంస్కరణ, వితంతు వివాహాలు, అనాధ శిశు సంరక్షణ శాలలు అన్నింటిలోను భార్యా భర్తలిర్వురు కృషి చేశారు. అయినా ఇప్పటికీ స్త్రీ జనోద్ధరణ ఇంకా అట్లే కొనసాగుతూనే ఉంది. దర్శిసుభద్రమ్మ జీవితం, సంఘసంస్కరణ మనకు ఈనాటికీ స్ఫూర్తిదాయకాలే.



# విద్యా వ్యవస్థ - కుంభకోణాలు

- డా॥ విజయభారతి

విద్యావంతులయిన స్త్రీలు సమాజానికీ భావితరానికీ ఎంతోమేలు చేస్తారని అనుకుంటూ ఉంటాం. స్త్రీ విద్యావంతురాలయితే ఇంటినంతటినీ తీర్చిదిద్దుతుందనీ ఆ విధంగా కుటుంబం లాభపడుతుందనీ విద్యవల్ల వచ్చే వినయమూ, సంస్కారమూ, సామాజిక స్పృహ వంటి వన్నీ సమాజాన్ని నీతి వంతంగా ఉంచటానికి తోడ్పడతాయనీ ఆశించారు పెద్దలు. భారతదేశ సంస్కృతి స్త్రీల పరంగా నిష్కళంకంగానూ, నిర్మలంగానూ ఉండటం వల్లనే ప్రపంచదేశాలలో సాంస్కృతికంగా మనదేశానికి గొప్ప గుర్తింపు వచ్చింది. పురాణాల ద్వారా తెలియ వస్తున్న వివరాలను గమనించినా ఆ విషయమే ధ్రువపడుతుంది. ఇప్పటి వరకూ ప్రభుత్వ పరంగా గాని, ఇతరత్రాగాని కుంభకోణాలేమైనా జరిగితే సాధారణంగా పురుషులే బాధ్యులుగా ఉండేవారు. స్త్రీల ప్రమేయం ఉండేది కాదు. ఉన్నపటికీ అతి తక్కువగా ఉండేది. “గత కాలము మేలు వచ్చుకాలము కంటను అన్నమాటను నిజం చేస్తూ స్త్రీలు నడిపిన కుంభకోణాలూ ఇప్పుడు వెలుగులోకి వస్తున్నాయి.

రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం రేకెత్తించిన రెండు కుంభకోణాలలో స్త్రీలు ప్రధాన పాత్రధారులుగా ఉండటం వెనకగల సామాజిక, ఆర్థిక, మానసిక పరిస్థితులను విశ్లేషించుకోవలసిన అవసరం ఈనాడు కనిపిస్తున్నది. ఈ స్కాంలు రెండూ విద్యారంగానికి చెందినవే కావటం విచారించ దగిన అంశం.



ఆరేళ్ళ క్రితం (2000-2001) బయటపడిన స్కాలర్ షిప్‌ల స్కాంలో నిందితులు అనేకులు ఉన్నప్పటికీ కొందరు స్త్రీలు కూడా అందులో కీలక పాత్ర వహించారని అన్నారు. సాంఘిక సంక్షేమ శాఖలో జరిగిన ‘స్కాం’ అది. 5793.80 కోట్ల రూపాయలు అప్పటి ప్రభుత్వమే మళ్ళించిందనీ ఇంకా మరెన్నో కోట్ల రూపాయలు దుర్వినియోగమైనాయనీ అన్నారు. విచారణ సాగుతూనే ఉంది. వెనక బడిన వర్గాల విద్యార్థులు చదువు కోవటానికి ఆర్థిక సహాయం అందించే కేంద్ర పథకాలను రాష్ట్రాలు స్వార్థానికి వాడుకోవం ఎంత విద్రోహకరమో ఆలోచించే కొద్దీ అందుకు కారకులైన వారిపై జుగుప్స కలుగుతుంది. అధికారులూ ప్రభుత్వ నేతలూ ఆ నిధులను ఇతర అవసరాలకు మళ్ళించి చట్టం ఒక చేత్తో ఇస్తూ మరో చేత్తో లాక్కోవటం; సంక్షేమ పథకాలు ఆర్భాటంగా ప్రకటిస్తూ వాటిని స్వాహా చేయటం అనేది ప్రజాస్వామ్యంలో చాలా సాధారణమై పోయింది. ప్రతి సరఫరాలోనూ కేటాయింపులోనూ పర్సెంటేజీలు అలవాటయి పోయాయి. ఈ వ్యవస్థను ఇలాగే సాగనివ్వాలా?

ప్రస్తుతం (2007) డిపెప్ కుంభకోణంలో వందల కోట్ల రూపాయలు దుర్వినియోగమైనట్టు చెబుతున్నారు. ఇవి కేంద్రం అందిస్తున్న సర్వశిక్షా అభియాన్ నిధులు. బాలల విద్యావసరాలకు ఉద్దేశించినవి. ఈ కుంభకోణం వల్ల భావి పౌరుల విద్యావసరాలు తీర్చక పోవటంతో పాటు అవిద్యతో కూడిన సమాజాన్ని ఆంధ్రులకు అందించినట్టా అయింది. స్కాలర్ షిప్‌ల వ్యవహారంలోగాని, సర్వశిక్ష అభియాన్ నిధుల వ్యవహారంలోగాని వెనకబడిన వర్గాలూ, హరిజన గిరిజన వర్గాలూ దెబ్బతిన్నాయి. వారి విద్యాభివృద్ధి కుంటుపడింది. కార్పోరేట్ విద్యాసంస్థలు పెచ్చు పెరిగి ధనిక సమాజం అన్ని అవకాశాలూ అంది పుచ్చుకుంటున్న తరుణంలో ప్రభుత్వ విద్యా సంస్థల మీద ఆధారపడిన బడుగు విద్యార్థులే ఈ మోసాలకు గురవుతుండటం తీవ్రంగా ఆలోచించవలసిన విషయం, ఈ కుంభకోణాలకు కారకులైనవారూ అందులో ఇంతో అంతో పాలుపంచుకున్న వారూ విద్యావంతులే కావటం శోచనీయమైన విషయం.

ఇవన్ని ఒక పద్ధతి ప్రకారం జరుగుతున్నాయా బడుగు వర్గాలను దెబ్బతీసే ఆలోచనలు వీటి వెనక ఉన్నాయా? విద్యా ఉద్యోగ రంగాలలో తమతో పోటీ పడుతున్న వారిని నిలువరించటానికి వేస్తున్న ఎత్తులా ఇవి? విదేశాల నుంచి విద్యార్థులు వచ్చి భారతదేశ విద్యాలయాల్లో శాస్త్ర విద్యలు నేర్చుకునేవారట ఒక కాలంలో. నలంద, తక్షశిల విద్యా కేంద్రాలను గొప్పగా, గత సంస్కృతీ వైభవానికి గుర్తులుగా, చెప్పుకునే భారతీయత ఆంధ్రదేశంలో ఎందుకు విద్రోహకరంగా మారిందో ఆలోచించాల్సిందే.

“ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్” అన్నారు. ఏ పనైనా స్త్రీలయితే చాకచక్యంగా చేస్తారని వారిని ఈ కుతంత్రాలలోకి దింపి ప్రోత్సహిస్తున్నారా? అనేదీ ఆలోచించాలి. ఈ కుతంత్రాల వల్ల నష్టపోతున్నది మధ్యతరగతి పిల్లలు దిగువ వర్గాల పిల్లలూను. మధ్య తరగతి ప్రజలూ దిగువ వర్గాల ప్రజలూ భారతదేశ జనాభాలో హెచ్చు శాతంలో ఉన్నారు. వారి ప్రయోజనాల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రకరకాల ప్రణాళికలు వేస్తూ ఉంటాయి. కోట్లాది నిధులు ఖర్చు పెడుతూ ఉంటాయి. అయితే ఈ డబ్బును దోచుకోవటానికి ప్రణాళికలు వేసేవారూ అక్కడే అందుకు తగ్గట్టే ఉన్నారు. అమలు జరిపేవారిపై ఒత్తిడి తెచ్చి నయానా భయానా లొంగకపోతే డబ్బులు ఇచ్చి పెర్సెంటేజీలు ఇచ్చి తమ పనులు చేసుకుంటూ పోతారు. ఆ మార్గాలు ఎన్నెన్నో.

మధ్య తరగతి, దిగువ తరగతి ప్రజలు భుక్తి కోసం పడే పాట్లు తక్కువ వేమీ కాదు. ఇక మీదట ఈ కుట్రలను ఎదుర్కొనే ప్రయత్నమూ వారిపైనే పడుతున్నది.

ఏపుట్టలో ఏపాము ఉందో అని భయపడే రోజులు కావు ఇవి. ఏ పనివెనక ఎందురు ప్రముఖులున్నారో, ఎందరు రాజకీయ

నాయకులున్నారో, ఎందరిని సమిధలుగా చేస్తున్నారో అని భయపడే రోజులు వచ్చాయి.

ఈ ఆలోచనలతోపాటు తల్లిదండ్రులు తమ పిల్లల విద్యావకాశాల పరంగా పాఠశాలల్లోనూ ప్రభుత్వ- ప్రభుత్వేతర విద్యారంగ సంస్థలలోనూ జరుగుతున్న కార్యకలాపాలను గమనిస్తూ ఉండవలసిన అవసరం ఎక్కువ కనిపిస్తోంది. ఇలాంటి కుంభకోణాలు వెలుగులోకి వచ్చినప్పుడు ప్రభుత్వం తక్షణం స్పందించి పరిహార చర్యలు చేపట్టాలి. వాస్తవానికి అదీ జరగవలసిన వేగంతో జరగటం లేదు. పూర్వం రాజులు పాలించే కాలంలో రాజ శాసనాలు త్వరగా అమలయ్యేవట, రాజ ధర్మాలు వివరంగా చెప్పే గ్రంథాలు భారతీయ ................ చాలనే ఉన్నాయి. పురాణాలలోనూ విస్తృతంగా చెప్పారు. మత్స్య మహాపురాణంలో చేప (మత్స్యం) రూపంలో ఉన్న నారాయణుడు మనువుకు చెప్పినట్టుగా బోలెడు ధర్మాలు చెప్పారు. అందులో రాజ ధర్మాలు 28 అధ్యాయాలలో (217-242) చెప్పారు. దోషులను దండించే విధానాలూ వివరించారు.

ఇతరులు తన దగ్గర దాచుకున్న ధనాన్ని అను భవించిన వారిని దొంగల లాగనే దండించాలట. దాచిన ధనానికి రెట్టింపు ధనాన్ని అతని చేత ఇప్పించాలట. మోసాలతో పరద్రవ్యాన్ని అపహరించిన వారినీ వారి సహాయులనూ చిత్రహింసలతో హింసించాలట.

విద్య చెబుతానని వెల తీసుకొని ఇవ్వకపోవటం నేరం. దానికీ శిక్ష ఉంది. పూర్వం విద్య నేర్చుకునే విధానాలలో వెల తీసుకుని విద్య నేర్పడమూ ఉండేది. 1) ఉచితంగా నేర్పే గురుకులాలు 2) ఒక విద్య నేర్పి మరో విద్య నేర్చుకునే పద్ధతులూ 3) డబ్బిచ్చి నేర్చుకునే పద్ధతులూ (మూడు రకాలు) ఉండేవట. ప్రస్తుత కుంభకోణాలలో విద్యా సంబంధమైన నేరాలకు రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత వహించాలి. 1) తనవంతు ఖర్చు పెట్టవలసిన డబ్బు ఖర్చు పెట్టకపోగా కేంద్ర ప్రభుత్వం ఇస్తున్న మొత్తాన్ని కూడా ఖర్చుపెట్టక పోవటం 2) దాన్ని దోచుకునే వారికి సహకరించటం నేరాలే అవుతాయి. రాజకోశాన్ని హరించిన వారిని చిత్ర హింసలతో చంపాలన్నాడు కౌటిల్యుడు. కేంద్ర నిధులను అపహరించటం ఇక్కడి నేరం. అప్పటి ఆ శిక్షలు ఈనాడూ అమలు అయితే బాగుండుననిపిస్తోంది.

బాధ్యత కలిగిన ప్రభుత్వోద్యోగులు వంచనా పరులకు సహకరించటం ఆందోళనకరంగా ఉంది. "మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే" (యజుర్వేదం) నేను నా కళ్ళతో (సృష్టిలోని) సర్వప్రాణులనూ మిత్రులలాగనే చూస్తాను అని ప్రమాణం చేయించేవారు పూర్వం. ప్రమాణాలు ఈనాడూ చేస్తున్నారు. ఉద్యోగ ధర్మాలున్నాయి. నైతిక విధులున్నాయి. జీతాలూ ఉన్నాయి. ఈ అన్నింటిలోనూ చివరి దాని మీదే దృష్టి పెట్టుకుంటే అది సమాజ పతనానికే దారి తీస్తుంది. పరోపకారం కోసమే ఈ శరీరం అని చెప్తున్న భారతీయ సనాతన ధర్మం వారికి గుర్తు రావటం లేదేమో. భారతీయతపై కృషి చేస్తున్నామని చెప్పుకునే సంస్థలు, భారతీయ నైతిక ధర్మాలను ప్రచారం చేయవలసిన అవసరం ఈనాడు ఉంది.

పూర్వ వ్యవస్థను పరిశీలిస్తే ధర్మాన్నీ, న్యాయాన్నీ నిలబెట్టిన వారిగా స్త్రీలు కనిపిస్తారు. రామాయణంలో సీత పాత్ర ధర్మాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్న విదుషి. భర్తకు ధర్మ బద్ధమైన సలహాలు ఇచ్చేది.

గొప్పజ్ఞానిగా పేరొందిన జనక మహారాజుకు అతని భార్య ఒకప్పుడు కర్తవ్యం బోధించిందట. రాజ్యం విడచిపెట్టి సన్యాసం తీసుకుంటానన్నాడు జనకుడు. కర్తవ్యాన్ని వదిలి వెళ్ళటం భావ్యం కాదన్నట అతని భార్య. ఎందరో మహాత్ములు నిన్ను ఆశ్రయించుకుని ఉన్నారు. ప్రజల బాగోగులు చూడటం నీ కర్తవ్యం. తల్లిని ఏడిపించి భార్యను దు:ఖపెట్టి వంశధర్మాన్ని వదిలి నిష్క్రియాపరుడవై ఏం చేస్తావు? ఏ గతికి పోతావో, అని హెచ్చరించింది ఆవిడ (శాంతి పర్వం ప్రథమాశ్వాసం 131-137) "ఇది ధర్మవిరోధం" అని చెప్పింది. ఈ వృత్తాంతం అర్జునుడు అన్నగారికి అంటే ధర్మరాజుకు చెప్పాడు. బంధువులను చంపి సంపాదించిన రాజ్యం నాకు వద్దు అని ధర్మరాజు అంటే అతనికి నచ్చచెబుతూ స్వధర్మం అనుసరించాలని చెప్పే సందర్భం ఇది. కీలక సమయాలలో కర్తవ్య బోధచేసే ప్రవృత్తి ఉన్న స్త్రీల చరిత్ర, సంస్కృతి మనకు ఉన్నది. అది ఈనాడు కృత్రిమమైన నాగరికతా జీవనంలో నాశనమై పోవటం కళంకితమవటం విచారించవలసిన విషయం.

రాజకీయ రంగంలో, వంచనాపూరిత జగుత్తులో మహిళలను పావులుగా వాడుకుంటున్న వ్యవస్థ స్థిర పడకుండా చూడ వలసిన బాధ్యత అందరిపైనా ఉంది. దీని మూలాను పెకలించితీరాలి. ✤

## బడి పిల్లల అమ్మ

- యం. రఘురామ్

ప॥ ఎనాటి బంధమో ఈనాటి అనుబంధం-2
మధ్యాహ్న భోజనంతో బడిపిల్లల అమ్మనైనా-2
కష్టమెంత చేసినా ఫలితమే లేదాయె
కాలమెంత కరిగిన పని భద్రత లేకపోయె
॥ఎనాటి॥

చ॥ వంట పాత్రలు లేవు వంటగ్యాసు లేదు
పురుగుల బియ్యం తోటి తక్కువ కొలతలతోటి
ఎండవానల్లోన పొగలు సెగలల్లోనా-2
కాలిమాడి నేను బొగ్గై పోతున్నాను
॥ఎనాటి॥

చ॥ ఆకలితో అలమటించే పసిబిడ్డల చూడలేక
పస్తులతో పెట్టలేక వడ్డీలకు అప్పు తెచ్చి
చిక్కులలో చిక్కుకోని భోజనాలు పెడుతున్నా-2
బిల్లు లోచ్చె దారిలేక బికారిగా మారుతున్నా
॥ఎనాటి॥

చ॥ ఉప్పు, పప్పు ధరలేమో చుక్కల్లో కెక్కిపోయె
ఆదరించె సర్కారు అదుపెమో చేయదాయే
సర్కారు మారుతున్న మన బ్రతుకులు మారలేదు-2
ఆదుకునే సంఘం ఉంది
అందుకో జెండా అంది
ఐద్వా సంఘం అండ వుంది.
అందుకో జెండా అంది
అందుకో జెండా అంది.

# గర్భాశయము అద్దెకి భారతదేశపు నూతన ఎగుమతి

- జయతి ఘోష్



కొత్త తరహ సర్వీసులు అందచేయటంలో భారతదేశం వేరే దేశానికి సాటిరాదు. దీనికి రుజువుగా, భారతదేశాన్ని ఎంచుకోనటంలో స్పష్టంగా కనబడుతోంది, వాడుకోవటంలో పెరుగుతోంది. మాతృత్వానికి బదులుగా వేరే పద్ధతి అవలంభించటం. ఈ పద్ధతి ఏమిటంటే ఒక స్త్రీ వేరే బిడ్డలు లేని భార్య భర్తలకి తను బిడ్డను మోసి, కని అందజేయటం, తొమ్మిది నెలల తరువాత, సాధారణంగా దీనికి కొంత డబ్బు ముట్ట చెప్పటం జరుగుతుంది. దీనికి అనేక రకాల పద్ధతులు, కొత్త సాంకేతిక పద్ధతి వల్ల సఫలీకృతం మవటం. సాధారణంగా, పేరెన్నిక గాంచిన విట్రో ఫెరిలులైజేషన్ (ఐవిఎఫ్) విలక్షణమైనది. 'తల్లి' గర్భం నుంచి అండకణాన్ని తండ్రి యొక్క బీజకణాన్ని టెస్టుట్యూబ్‌లో వుంచి పిండం తయారు అవ్వగానే బిడ్డను కనివ్వడానికి సిద్ధపడిన ఆమె గర్భాశయంలోనికి పంపబడుతుంది.

నైతిక పదజాలంలో అది ఎండిన బీడులాంటిది. విభిన్న సమాజాలు, విభిన్న రీతులలో దీనిపై స్పందించారు. స్వీడన్, స్పెయిన్, ఫ్రాన్స్ మరియు జర్మనీ మొదలైన దేశాలు, ప్రజాభిప్రాయన్ని ఓటు ద్వారా సేకరించి ఈ పద్ధతిని నిషేధించారు. ఏదేశంలో దీనిని జరపటానికి ఒప్పుకున్నారో, అక్కడ కొన్ని నిబంధనలు వున్నాయి. కెనడాలో, డబ్బు పుచ్చుకోవటం నిషేధం, వ్యాపార పరంగా కొనసాగించటాన్ని నిరోధించారు. బ్రిటను దేశాలలో కొంత ఖర్చులు మంజూరు చేశారు. దీనిని కొన్ని అభివృద్ధి చెందిన దేశాలు కూడ ప్రవేశ పెటాయి. అర్జంటీనా, ఆఫ్రికా మొదలైనవి, కొన్ని కఠినమైన నియమాలు వున్నవి. ఈ పద్ధతిని అమలు చేయటానికి, కేసు తర్వాత కేసులను పున:పరిశీలన, వాటిని, జాగ్రత్తగా పరిశీలించే, స్వచ్ఛంధ నైతిక విలువలు పాటించే కమిటీలున్నాయి. దీనిని ఇంతగా పట్టించుకోవటానికి చాలా కారణాలు వున్నాయి. నైతిక కారణాలు కాక, దీని వల్ల బిడ్డ నివ్వబోయె తల్లికి అనేక క్లిష్ట సమస్యలు కూడుకొని వున్నాయి. శారీరకంగా మరియు మానసికంగా, ఉద్రిక్తత, బిడ్డను పుట్టిన వెంటనే ఇవ్వటం వల్ల, ఆరోగ్యానికి హానికరం మవుతుంది.

శారీరక యిబ్బందులకు ఎక్కువగా గురి కావటమనేది, అభివృద్ధి చెందని దేశాలలో వుంది. ఒకటి గర్భం వల్ల వచ్చే యిబ్బందులు, తరువాత ప్రసవసమయంలో తగినంత ఆరోగ్య సేవలు లేకపోవటం వల్ల ఈ ఇబ్బందులకు ఎక్కువగా పేదవర్గాల స్త్రీలు గురి అవుతున్నారు, వారి ఆరోగ్యం అంతగా బాగుండదు మరియు పౌష్టిక ఆహారం తీసుకొనే అవకాశం లేదు కాబట్టి, సామాజికంగా ఆర్థికంగా వెనుకబడిన స్త్రీలలో రోగగ్రస్తులు అవ్వటంతో పాటు చావులు ఎక్కువ, అయినప్పటికి వీళ్ళనుంచే బిడ్డను కనివ్వటానికి ఎన్నుకుంటారు.

ఎంత మానసిక ఉద్వేగతను అనుభవిస్తుందో దాని గురించి తక్కువ అంచనా వేయటానికి లేదు. ఏదో పనిచేసి పెట్టటం కాదు, బిడ్డను కనివ్వటం. చాలా కష్టమైనది, చిక్కులతో కూడుకొన్నది. ఆవేశపూరితమై, తల్లి ప్రాణాలని కూడ పోగొట్టు కోవటం జరుగుతుంది. హార్మోనుల మార్పుల వల్ల అనేక భావాలు మనస్సులో ఉత్పన్నమవ్వచ్చు. అంతిమంగా బిడ్డను ఇవ్వాలి. అనే భావన గర్భిణీ స్త్రీలో కలుగుతుంది. బిడ్డ నివ్వటానికి చాలా మానసిక ఆందోళనకు గురి అవుతుంది. ఈ విషయాన్ని ప్రభుత్వపరంగా గుర్తించటం జరిగింది, బ్రిటనులో మరియు అమెరికాలోని కొన్ని రాష్ట్రాలలో, ఉదాహరణకి, బిడ్డనిచ్చిన తల్లికి ప్రసవించిన తరువాత బిడ్డని కొంతకాలం ఆమె దగ్గరవుంచే అవకాశం, తన కస్టడీలో వుంచుకోవటానికి షరతును కోరవచ్చు. (దీనిమూలకంగా, చాలా సంఘటనలు, చాలాకాలం వరకు సాగాయి ఈ షరతు మూలకంగా) కాని భారతదేశంలో, ప్రభుత్వం దీని విషయమై, లేక ఇలాంటి వాటి గురించి పట్టించు కోవటం జరగలేదు, నైతికంగా గాని లేక ఇలాంటి తల్లుల ఆరోగ్యపరంగా గాని, లేక వారి మనోభావ ఉద్వేగాన్ని గుర్తించటం జరగలేదు. వాస్తవానికి, పరిశ్రమను క్రమబద్ధం చేయటం ఎంతో అవసరమని, దాని ఆవశ్యకతను గుర్తింపు చేసినప్పటికి, సరియైన చట్టాలు లేవు. కొన్ని కట్టుబాట్లులేని మార్గదర్శక సూత్రాలు, భారతదేశ వైద్య పరిశోధన సంస్థ విడుదల చేసినప్పటికి, వైద్యులు గాని, వైద్య పర సంస్థలుగాని, లేక గర్భాశయము అద్దెకివ్వాలి అనుకొన్న మహిళలు కాని అనుసరించటం లేదు.

దీని ఫలితంగా, కొన్ని రాష్ట్రాలలో ఇది వేగంగా జరుగుతున్నది. డబ్బు తీసుకొని బిడ్డను కనియిచ్చే మాతృత్వానికి, ఏరకమయిన

న్యాయపరమైన చట్టాలుగాని, అడ్డంకులుగాని లేవు. భారతదేశం ఇది చవకబేరం, కొన్ని మిలియన్లల పేద స్త్రీలకి, ఉపాధి అవకాశం లేనివారికి, కొంత ఆదాయం సంపాదించటానికి ఒక మార్గమయ్యింది.

ఇలా బిడ్డని కనియిచ్చే పద్ధతి భారతదేశానికి క్రొత్తకాదు. మహాభారత కాలంలో పాండవ అన్నదమ్ముల గురించి ఆలోచించండి. కాని ఇండియాలో గాని లేక వేరే చోటులోగాని, తల్లిదండ్రుల బాధను అర్థం చేసుకొని సాంప్రదాయ బద్ధంగా వున్న స్త్రీ బంధువులు ఈ పనికి ఒప్పుకుంటున్నారు. విట్రోఫెర్టిలైజేషన్ వల్ల ఎన్నో రకాలుగా సాంకేతిక బద్ధంగా అవకాశమిస్తున్నాయి. గతంలో వూహించలేని పద్ధతులు, గడ్డకట్టుకొన్న అండోశయం, ఈ బిడ్డను కనివ్వటం. చనిపోయిన తల్లిదండ్రుల నుంచి వాడు కోవటం జరుగుతుంది. కాని లాభం కోసం వ్యాపారపరంగా అభివృద్ధి చెందటానికి అవకాశమిచ్చింది. ఇంకా ఈ పద్ధతులు సాంకేతికపరంగా అభివృద్ధి చెందలేదు. జీవిత ప్రాథమిక అంశమయిన ఈ మాతృత్వం వ్యాపార పరంగా ప్రచారంలోకి వచ్చింది.

అప్పుడే మనదేశంలో 'మెడికల్ టూరిజం' పెద్ద ఎత్తున జరుగుతొంది. ఐదు నక్షత్రాల (ఫైవ్‌స్టార్) ఆసుపత్రులు, ఎక్కువ అర్హత పొందిన వైద్యులతో, నర్సులతో (చాలా మంది ఆర్థిక సహాయం అందించు విద్యా పద్ధతిలో ట్రైనింగు పొందినవారు) చాలా తక్కువలో మరియు సమాన నిపుణతతోకూడిన సర్వీసులను, విదేశీయాత్రికులకు అందజేస్తున్నారు. చాలా తక్కువ ఖర్చుతో మంచి ఆరోగ్య పరమైన సేవలు, సౌకర్యాలు, కనే వయస్సు వున్న ఆడవాళ్లకు సేవలందిస్తున్నారు. ఈరకమయిన కలగలపు వల్ల "రిప్రొడక్టివ్, టూరిజమ్" (ప్రత్యుత్పతి టూరిజమ్) అన్న పేరుతో పెద్ద సంఖ్యలో మహిళలు వస్తున్నారు.

ప్రత్యేకమైన లాభం ఏమిటంటే, బిడ్డలు లేని దంపతులు సంతానం కోసం యావత్తు ప్రపంచం నుంచి తరలి వస్తున్నారు. కారణం ఇక్కడ తక్కువ ఖర్చుతో కూడుకున్న పని. వ్యాపారరీత్యా భారతదేశంలో ఈ మాతృత్వం రేటు, 50,000 రూపాయల నుంచి 2 లక్షల వరకు, ఈ పరిధిలో తక్కువకే గిట్టుబాటు అవుతుంది. దీనిని అనువాదిస్తే డాలర్లు 1000 ఈ తల్లికి ముట్టుతుంది. ఖర్చులు అన్ని లెక్కవేస్తే, ఒక దంపతులు వేరే దేశం నుంచి, ఒక బిడ్డని పొందాలి అంటే తక్కువలో తక్కువ, 2500 నుంచి 3000 వేల డాలర్లు చెల్లించాలి. దీనితో పోలిస్తే అమెరికాలో 15,000 నుంచి 3000 వేల డాలర్లు, దీనికి అమెరికాతో 15,000 నుంచి 30,000 డాలర్లు అవుతుంది.

కాని దీంట్లో వేరే లాభాలు కూడ వున్నాయి. సరియైన పద్ధతి అమలు లేకపోవటంతో, దంపతులు తక్కువ నిబంధనలతో, తేలికగా ప్రసవం అయ్యే పద్ధతులకి బజార్లలో వేట మొదలు పెడతారు. ఈ బిడ్డని కని యిచ్చే పద్ధతిని నియంత్రించటానికి బదులు, ప్రొత్సహించు చున్నారు. వుదాహరణకి, ప్రస్తుత నిబంధనలు ఏమిటంటే, ఆ తల్లి ప్రసవానికి ముందు బిడ్డ మీద తన హక్కులు ప్రసవమయ్యాక వదులుకుంటానని సంతకం పెట్టియివ్వాలి. తల్లి కడుపులో పిండాలను ప్రవేశపెట్టడానికి వేరే దేశాలలో రెండుసార్లుకి అనుమతి యిస్తే, మనదగ్గర 5 సార్లు ప్రవేశ పెట్టటానికి అనుమతినిస్తారు.

గర్భాశయ మార్కెటు, భారతదేశంలో యింక ఏ మాత్రం చీకటి వ్యాపారం కాదు. ఈ పరిశ్రమ పగటి వ్యాపారం, ఇంకా ప్రకటనలు కూడ చేస్తూ పూనాలోని ఒక సంస్థ, బిడ్డలేని వాళ్ళని తల్లిదండ్రులను చేస్తామని ప్రకటనలు ఇస్తూ 25-30 ఏళ్ళ వయస్సు స్త్రీలు వాళ్ళ సంస్థ సభ్యురాలుగా సేవలందించవచ్చు అని బహిరంగంగా ఆహ్వానిస్తోంది! పేదవారు, భారతదేశంలోనే కాక వేరే దేశాలలో కూడ తరుచు తమ శరీరాలని బ్రతకటం కోసం ఇంట్లోవారిని బ్రతికించటం కోసం అమ్మటం జరుగుతోంది. శరీర అవయవాలు మూత్రపిండాలు లాంటివి అవసరమయినవారికి, అమ్ముతుంటారు. అని ప్రమాణ పత్రాల వివరణ, మరియు చెడు ఫలితాలకు దారి తీస్తోంది. కొన్ని కారణాల వల్ల ఈ తరహా మాతృత్వం మీద సమాజ స్పందన తక్కువ అని అనవచ్చు. దీనికి బదులు ఆరోగ్య నిపుణులు ఇంకొక మార్గం కనిపెట్టారు అని, విదేశ ద్రవ్యం సంపాదించడంతో పాటు "పాక్షికంగా నిరుద్యోగం"లో వున్నవారికి ఉద్యోగావకాశాలు కల్పించే మార్గం చూపించాయని సెలవిచ్చారు.

వార్తా పత్రికల రిపోర్టు ద్వారా తెలిసిందేమిటంటే, గుజరాత్‌లోని ఆనందలోని ఆసుపత్రి ఇన్ చార్జీ అయిన డాక్టరు బహిరంగంగా "ఆదాయం సంపాదించే అవకాశాలు" అని వేడుకలు జరుపుకున్నారు. చాల పేద స్త్రీలు అంటే డబ్బు అత్యంత అవసరం అయిన వారికి ఈ అవకశాలు కల్పిస్తోంది. ఇది తేట తెల్లంగా ప్రత్యక్షంగా కనపడుతొంది. ఎందుకంటే వాళ్ళు కుటుంబాన్ని పోషించుకోవటానికి లేక అనారోగ్య భర్తకి ట్రీట్‌మెంటు కోసం, ఇది స్వచ్ఛందంగా వాళ్ళంతటవాళ్ళు చేస్తున్నారు. ఇంతకుముందు హెల్త్ సెక్రటరిగా గుజరాతులో వున్న ఆయన ఇది కొత్త తరహా ''పెట్టుబడి దారీ నంస్థ'', ''సాధించు-సాధించు-ఉద్యోగం'' అని వర్ణించాడు మరియు భారతదేశంలో దారిద్ర్యంతో బాధపడుతున్న రాష్ట్రంకి సిఫార్సు చేశారు.

రిప్రొడక్టివ్ టూరిజం శక్తివంతమైన పెద్ద వ్యాపారం. ఐసిఎమ్ఆర్ కొద్ది సంవత్సరాలలో 6 బిలియను డాలర్లు సంపాందించవచ్చు అని అంచనా. చాలా మంది పేద స్త్రీలు వాళ్ళకున్న ఉపాధిలో, వాళ్ళకున్న నైపుణ్యాలతో సంపాదించిన దానికంటే, దీంతో ఎక్కువ సొమ్ము చేసుకోవచ్చు అని ఎంతోమంది పేద స్త్రీలను ఈ వ్యాపారంలో దించాలని ప్రయత్నం.

ప్రభుత్వపరంగా సందేశమేమిటంటే తక్కువ స్థాయిని మనం మర్చిపోవాలని. దీని వైపు ఆకర్షితులవటానికి ఎన్నో కారణాలున్నాయి. బహుశా ఇది స్వాభావికం, కొత్త ఫారిన్ ఎక్స్చేంజ్, హెల్త్ ఆఫీసర్లు దీనికి స్వాగతం పలకటం, అభివృద్ధి పేరుతో సాఫ్ట్‌వేర్‌ని, ఈ పరిశ్రమ అధిగమించుతుందేమో ఎవరికి తెలుసు? బహుశ దీనికి కూడ ప్రోత్సాహక పూరితమైన అవకాశాలు కల్పిస్తుందేమో పన్నులు లేకుండా ఇంతకుముందు ప్రభుత్వం ఐటి కంపెనీలకు ఇచ్చినట్లు ఇది ఒక తార్కికం, ప్రపంచీకరణం ఇచ్చే కొత్త బహుమతి మనకు.



# ఏవీ ? ఏలినవారు నాడు చేసిన బాసలు... ?

- టి. జ్యోతి

"సమాజాభివృద్ధిలో మహిళలను భాగస్వాములను చేస్తాం", "మహిళలను అన్ని రంగాలలో ముందు పీఠిన నిలబెడుతాము", "మహిళా సాధికారతకు అన్ని రకాల చర్యలు తీసుకుంటాము" "6 నెలలు దాటిన డ్వాక్రా గ్రూపులకు రివాల్వింగ్ ఫండ్; పావలా వడ్డీకే రుణాలు; గ్రూపులకిచ్చే గ్యాస్ సిలిండర్‌పై సబ్సిడీ, మద్యం అమ్మకాలను దశలవారిగా నియంత్రిస్తూ, క్రమంగా సంపూర్ణ మద్య నిషేదం వైపు అడుగులేస్తాం. మహిళలపై పెరుగుతున్న హింసను అరికడతాం"

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో! ఎన్నెన్నో!! "చెప్పేవాడికి వినేవాడు లోకువ" అన్నట్టు నోటికొచ్చిన వాగ్దానం చేసిన కాంగ్రెస్ పార్టీ రాష్ట్రంలో అధికారంలోకి వచ్చి 3 ఏళ్ళు పూర్తయ్యింది. ఈ సందర్భంగా, ఏవి? ఏలినవారు నాడు చేసిన బాసలు? అని వెనుదిరిగి చూస్తే.....

## మహిళల ఉసురు పోసుకుంటున్న మద్యం:-

దశల వారిగా మద్యం అమ్మకాలను నియంత్రిస్తూ, క్రమంగా సంపూర్ణ మద్య నిషేధం వైపు అడుగు లేస్తామని రాష్ట్ర మహిళలకు వాగ్ధానం చేసి, అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ఆ మాటే మరచింది. గొంతు తడుపు కోవడానికి గుక్కెడు నీళ్ళు ఇవ్వలేని ప్రభుత్వం, మద్యాన్ని మాత్రం గడప గడపకూ అందిస్తూంది. 2003-04 సం॥లో 3,843 కోట్ల రూ॥ ఎక్సైజ్ ఆదాయముంటే 2006-07 సం॥ నాటికి 5,368 కోట్ల రూ॥లకు చేరుకుంది. ఈ సం॥ ఆఖరు నాటికి మరో 700 కోట్ల రూ॥లు అదనంగా ఆదాయం సమకూర్చుకోవాలన్నది ప్రభుత్వ లక్ష్యం. ఎక్సైజ్‌పై వచ్చే ఆదాయాన్నే ప్రధానమైన ఆదాయ వనరుగా ఎంచుకున్నదీ ప్రభుత్వం.

ఊరూరా బడ్డీకొట్టు, కిరాణాషాపు, ఒకటేమిటి? 'కాదేది తనకనర్హం' అంటూ అన్నింటా మద్యం సర్వంతర్యామిలా దర్శనమిస్తూ వుంది. గుడి, బడి, జనావాసాలు, ఆసుపత్రులకు దగ్గరలో మద్యం షాపులు పెట్టకూడదు అనే నిబంధనలకు కూడ నీళ్లొదిలింది. సామాన్య ప్రజల మానసిక బలహీనతతో ఆడుకుంటున్న ప్రభుత్వం మద్యం అమ్మకాలు పెంచడం ద్వారా మహిళలపై హింస నేరాల సంఖ్య పెంచడమే కాక వారి జీవన ప్రమాణస్థాయిని దిగజార్చుతూ, మహిళల ఉసురుపోసుకుంటూ వున్నది.

## నిర్వీర్యమైన స్వయం సహాయ గ్రూపులు:-

రాష్ట్ర వ్యాప్తంగా 6,34,914 గ్రూపులున్నవి. 6 నెలలు దాటిన గ్రూపులన్నింటికి రివాల్వింగ్ ఫండు, దీపం పథకం ద్వారా గ్రూపు సభ్యులకు సబ్సిడికీ గ్యాస్ సిలిండర్ అందజేస్తామని, మహిళల సాధికారతకు కట్టుబడి వుంటామని నమ్మబలికింది. అధికారంలోకి రాగానే గతంలో కొనసాగించిన రివాల్వింగ్ ఫండ్, సబ్సిడీలోన్లు పూర్తిగా ఎత్తివేసింది. తాము కూడబెట్టుకున్న డబ్బునే, గ్రూపు సభ్యులు అవసరాల ప్రాతిపదికన అప్పులు తీసుకుంటున్నారు. రివాల్వింగ్ ఫండ్ ఆగిపోవడంతో గ్రూపులు కొనసాగించడంలో ఆసక్తి తగ్గుతూఉంది. క్రమేణ గ్రూపులు చెల్లా చెదురు అవుతున్నవి. మహిళల్లో కదలిక, ఆత్మవిశ్వాసం, సంఘ చైతన్యం పెంచిన స్వయం సహాయ గ్రూపులు ఈనాడు దిక్కుతోచని స్థితితో పడినవి.

## నోటి లెక్కకే పరిమితమైన పావలా వడ్డీ రుణాలు:-

పొదుపు గ్రూపులన్నింటికి, 25 పైసల వడ్డీ అమలు చేస్తామని చెప్పిన ప్రభుత్వం ఆచరణలో లబ్ధిదారులకు అనేక అడ్డంకులు సృష్టిస్తుంది. గ్రూపులను ఎ,బి,సి,డి అని కేటగిరిలుగా విభజించడం వల్ల 30% గ్రూపులకు మాత్రమే పావలా వడ్డీ అమలు అవుతున్నది. ప్రతినెల 5వ తేదిలోపు సమావేశాలు నిర్వహించడం, బ్యాంకులో జమ చేయడం, మినిట్స్ రాయడం, ప్రభుత్వ కార్యక్రమాల్లో పాల్గొనడం తప్పనిసరి చెయ్యడంతో, ఏ కేటగిరి క్రిందికి కొద్ది గ్రూపుల మాత్రమే వస్తున్నవి. ఆర్థికంగాను, అక్షరాస్యతకు దూరంగా వున్న ఎస్.సి, ఎస్.టి గ్రూపులు లబ్ధిదారుల్లో నామమాత్రంగా వున్నారు. 5000 కోట్ల రూ॥ పావలా వడ్డీ రుణాలకు కేటాయిస్తామని చెప్పి, బడ్జెట్‌లో 76 కోట్ల రూ॥లు మాత్రమే కేటాయించి మాటలకు చేతలకు పొంతన లేకుండా, చేతులు దులుపుకుంది.

## రాబందుల్లా మారిన మైక్రోఫైనాన్స్ సంస్థలు:-

3 సం॥ల నుండి పొదుపు గ్రూపులకు రివాల్వింగ్ ఫండ్ రద్దయ్యి, పావలా వడ్డీ రుణాలు అమలుకాక, బ్యాంకులు అప్పులు ఇచ్చేందుకు విధించే షరతులు భరించలేక అట్టడుగు వర్గాలు మైక్రో ఫైనాన్స్ సంస్థల పంచన చేరుతున్నారు. షేర్, షేర్‌మూల, స్పందన, అస్మిత, స్వయంకృషి, ప్రగతి, సేవ, ఉండమ్మ బొట్టుపెడతా, పంపుకింద బిందె... ఇలా కుక్కగొడుగుల్లా పుట్టుకొచ్చి మహిళలను రాబందుల్లా పీక్కుతింటున్నాయి.

5 నుండి 10 మందిని ఒక గ్రూపుగా చేసి, వ్యక్తిగత రుణాలిస్తున్నారు. రుణాల చెల్లింపునకు అనేక నియమ నిబంధనలు విధిస్తున్నారు. స్లాబ్ రేటు పద్ధతిన రుణాలు వసూలు చెయ్యడంతో చెల్లింపులు, సామాన్య ప్రజలకు శక్తికి మించిన పనైంది. ఇంట్లో వున్న చెంబు, తపాలా వీధిన పడెయ్యడంతోపాటు, పోలీస్ స్టేషన్‌లో కూర్చోబెట్టడంతో, నలుగురిలో తలెత్తుకోలేక కుటుంబాలకు కుటుంబాలే ఆత్మహత్యల పాలవుతున్నారు. మైక్రో ఫైనాన్స్ సంస్థలను నియంత్రించడంలో, అవసరమైన నియమ నిబంధనలు రూపొంధించడంలో ప్రభుత్వం విఫలమైంది.

## రెక్కలొచ్చిన ధరలు, కుంటిదైన ప్రజాపంపిణీ:-

నిత్యవసర వస్తువుల ధరలు నియంత్రించడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. ధరలన్ని ఆకసాన్నంటుతున్నవి. ప్రజా ఉద్యమాల ఒత్తిడికి తలొగ్గి. రాష్ట్ర ప్రభుత్వం రేషన్ కార్డులు పెంచినా, అందుకనుగుణంగా, రేషన్ కోటాను పెంచకపోవడంతో పేద ప్రజలు, మహిళలు తీవ్ర ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. 2007 జనవరి నాటికి 2,16,53,705 రేషన్ కార్డులుంటే అందులో 1,76,17,436 బియ్యం

కార్డులు వున్నవి. తెల్లకార్డులపై ఇచ్చే బియ్యం, కిరోసిన్ కోటాను పెంచకుండా వున్నదాన్నే సర్దే ప్రయత్నం చేస్తూవుంది. పెరిగే జనాభాకనుగుణంగా రేషన్ షాపుల సంఖ్యనూ పెంచలేదు.

గ్యాస్ సిలిండర్‌కు రేషన్ కార్డుకు, రాజీవ్ స్వగృహ పథకానికి రేషన్ కార్డుకు లింకు పెట్టి ఇచ్చిన తెల్ల కార్డులను స్వాధీనం చేసుకుంటూ వుంది. మార్కెట్‌లో ఆకసాన్నంటే ధరలతో రేషన్ షాపుల్లో దొరికే అరకొర సరుకులతో బాలికలు, ముఖ్యంగా అట్టడుగు వర్గాలకు చెందిన మహిళల జీవితాలు మరీ దుర్భరంగా తయారయ్యాయి. ఇప్పటికే 80% మహిళలు; 54 శాతం పిల్లలు సరిఅయిన పోషకాహారం లేక రక్తహీనతతో బాధ పడుతున్నట్టు జాతీయ ఆరోగ్య సర్వేలో వెల్లడైంది.

**దైవాదీనంగా మారిన స్త్రీ ఆరోగ్యం:-**

ప్రజారోగ్యం రాష్ట్ర ప్రభుత్వానికి అప్రధానమైన అంశంగా మారింది. బడ్జెట్‌లో 2 శాతం కన్న తక్కువ నిధులు ఖర్చు పెడుతున్నారు. కుటుంబంలో వున్న అసమానతకు పేదరికం తోడై స్త్రీలు ఇంకా అనారోగ్యానికి గురవుతున్నారు. బాల్య వివాహాలు, చిన్న వయస్సులో గర్భధారణ, ఆసుపత్రులు అందుబాటులో లేకపోవడం మొ|| అంశాలు మహిళల ప్రాణం మీదకు తెస్తున్నవి. కుటుంబంలో పెరుగుతున్న హింస, ఇంటి చాకిరి, శారీరక నిర్మాణం, పరిసరాల అపరిశుభ్రత మొదలగునవి మహిళ ఆరోగ్యం మరింత విషమం చేస్తున్నవి. ప్రజారోగ్యంపై ప్రభుత్వం చూపే నిర్లక్ష్యం స్త్రీల ఆరోగ్య పరిస్థితిని మరీ దుర్భరం చేస్తువుంది.

**నిరాదరణకు గురవుతున్న స్త్రీ విద్య:-**

"మహిళా సాధికారత"కు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం ప్రతినిత్యం జపం చేస్తూ వుంది. "ఇల్లాలి చదువు ఇంటికే వెలుగు" అని సూక్తులు వల్లించింది. 2008 సం|| నాటికి సంపూర్ణ అక్షరాస్యతను సాధిస్తామని, ప్రైవేట్ విద్యా సంస్థలను నియంత్రిస్తామని, విద్య వ్యాపారీకరణను అరికడతామని ఎన్నికల ముందు కాంగ్రెస్ ప్రభుత్వం ప్రకటించింది. కాని ఆచరణలో ఆ దిశగా చర్యలేవి? మన రాష్ట్రంలో మహిళల్లో 51 శాతం మాత్రమే అక్షరాస్యులు, ఎస్.సి స్త్రీలల్లో 21 శాతంగా వుంటే, ఎస్.టి స్త్రీలల్లో 9 శాతానికి మించడం లేదు. జాతీయ అక్షరాస్యత క్రమంలో, రాష్ట్ర మహిళల అక్షరాస్యత 29వ స్థానంలో వుంది.

- విద్య వ్యాపారీకరణ వల్ల మహిళలకు, అట్టడుగు వర్గాలకు "చదువు అందని చందమామ"గా మారింది.

**జీవన్మరణ సమస్యగా ఇళ్ల స్థలాల సమస్య:-**

రాష్ట్రంలో అర్హులైన పేదలందరికి, ఇళ్ల స్థలాలేంటి? ఏకంగా ఇళ్లే నిర్మించి ఇస్తానని" ఆశ పెట్టిందీ రాష్ట్ర ప్రభుత్వం. రాష్ట్ర వ్యాప్తంగా తలదాచుకోవడానికి జానెడు జాగా ఇవ్వమని పెద్ద ఎత్తున్న మహిళలు ఉద్యమాల్లోకొస్తున్నారు. ప్రభుత్వ ఆర్థిక విధానాల వల్ల గ్రామీణ ప్రాంతాల నుండి పట్టణాలకు వలసలు పెరుగుతున్నవి. రెక్కాడితే డొక్కాడని జనాభా కూడ పెరుగుతూవుంది. భార్యా భర్తలిద్దరూ కష్టపడ్డా, ఏరులై ప్రవహిస్తున్న మద్యానికే,ఒకరి ఆదాయం తగలేస్తుంటే, ఇంటి కిరాయి కట్టలేక, కనీస అవసరాలు తీర్చుకోలేక సతమతమవుతున్నారు మహిళలు.

లక్షల సంఖ్యలో రాజీవ్ గృహకల్ప పథకానికి 1000 రూ|| డిపాజిట్ కట్టి ధరఖాస్తు పెట్టుకుని ఇంటి కోసం ఎదురుచూస్తుంటే పథకాన్ని అమలు చెయ్యలేమంటూ, బుట్టదాఖలుకు సిద్దమైందీ ప్రభుత్వం.

వందల ఎకరాల భూమి పలుకుబడి గల పెద్దలు, రాజకీయ నాయకులు, మంత్రులు, ఎమ్.ఎల్.ఎలు ఆక్రమించుకుంటుంటే మౌనంగా వున్న ఈ ప్రభుత్వం తలదాచుకునేందుకు జానెడుజాగా అడిగిన మహిళలపై లాఠీలు ఝుళిపిస్తుంది. నిర్బంధాన్ని ప్రయోగిస్తూ వుంది.

**బహుముఖాలుగా పెరుగుతున్న హింస:-**

రాష్ట్రంలో మహిళలపై హింస కొత్త రూపాలు దాల్చుతున్నది. ప్రపంచీకరణ పెరుగుతున్నంత వేగంగానే మహిళలపై హింస, పీడన, దాడులు పెరుగుతున్నవి. విచ్చలవిడి మద్యం అమ్మకాలు, మహిళలపై హింస మరింత పెరగడానికి ఆజ్యంపోస్తూంది.

ఒక్క 2005 సం||లో మహిళలపై జరిగిన హింసాకాండ వివరాలు చూస్తే వరకట్న హత్యలు 111, వరకట్న మృతులు 488, వరకట్న వేధింపులు 6,746, అత్యాచారాలు 898గా వున్నవి. ఆడపిల్లను వద్దనుకునే స్థాయికి సమాజం నెట్టబడుతూ రాష్ట్రంలో స్త్రీ పురుష నిష్పత్తి 1000:927 గా వుంది. పట్టణ ప్రాంతాల్లో ఈ నిష్పత్తి ఇంకా పడిపోతూ వుంది.

మహిళా ఉద్యమం పోరాడి సాధించుకున్న "గృహహింస రక్షణ చట్టం 2006" అమలుకు రాష్ట్ర ప్రభుత్వం అలసత్వం ప్రదర్శిస్తూ వుంది. చట్టం అమలుకు, ప్రత్యేకమైన బడ్జెట్ మరియు యంత్రాంగం ఏర్పాటు చెయ్యలేదు. గృహ హింస రక్షణ చట్టం అమలులో రక్షణాధికారులుగా ఐ.సి.డి.ఎస్ ప్రాజెక్టు డైరెక్టర్లకే అదనపు భాద్యతగా అప్పగించి చేతులు దులిపేసుకుంది.

పని ప్రదేశాల్లో పెరుగుతున్న లైంగిక వేధింపులను అరికట్టడానికి, సుప్రీమ్ కోర్టు ఇచ్చిన మార్గదర్శక సూత్రాలను రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటి వరకు చట్టం చెయ్యలేదు. ప్రభుత్వ ప్రయివేట్ ఆఫీసుల్లో ఫిర్యాదుల కమిటీ ఏర్పాటుకు ఎటువంటి ఆదేశాలు జారి చెయ్యలేదు. మహిళలపై హింసను అరికట్టడానికి, ఆర్థికంతో ముడివడని అనేక నిర్ణయాలపట్ల కూడ ప్రభుత్వం అలసత్వం ప్రదర్శిస్తూ వుంది.

మహిళలపై జరిగే అవమానాలు, వేధింపులలో మన రాష్ట్రం మొదటి స్థానంలో వుంటే, ఎయిడ్స్‌లో రెండవ స్థానంలో వుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో పెరిగిన పేదరికం, నిరుద్యోగం, కరువు, గ్రామీణ మహిళలపై పెనుభారాన్ని మోపుతున్నవి.

రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వ మూడేళ్ల పాలన మహిళల కడగండ్లను మరింత పెంచింది. సంక్షేమ పథకాలకు బడ్జెట్‌లో కోత విధించడం వల్ల, అట్టడుగు వర్గాలు, ముఖ్యంగా మహిళల పరిస్థితి దయనీయంగా మారింది. వైఎస్ మూడేళ్ల పాలన పూర్తయిన సందర్భంగా ప్రభుత్వం పునరంకిత సభలకు సమాయత్తమవడం కాదు. పునరాలోచన సభలు జరపాలి. ఎన్నికల మ్యానిఫెస్టోలో పేర్కొన్నటుగా కాంగ్రెసు ప్రభుత్వం, మహిళలకిచ్చిన వాగ్దానాలు, వాటి అమలుకు కృషి చెయ్యాలి. కనీసం రాబోయే రెండేళ్ళు అయినా చేసిన వాగ్దానాల అమలుకు కార్యోన్ముఖులు కావాలి. లేకుంటే చరిత్ర పునరావృతమవుతుంది. గత ప్రభుత్వానికి పట్టిన గతే ఈ ప్రభుత్వానికి పడుతుంది. తస్మాత్! జాగ్రత్త !!





# కాకతీయ విశ్వవిద్యాలయం

స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ లర్నింగ్ అండ్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్

విద్యారణ్యపురి, వరంగల్ 506009 (ఆం.ప్ర) ఫోన్: 0870-2438877, 2461487

## దూర విద్య బి.ఏ/బి.కాం. కోర్సు ప్రవేశార్హత పరీక్ష - 2007

ప్రవేశార్హత పరీక్ష తేది: 27-05-2007; ప్రవేశార్హత: ఏ విద్యార్హతలు లేకున్నను, ఉన్నను (ఇంటర్మీడియేట్ ఉత్తీర్ణత కానివారు) 30.06.2007 నాటికి 18 సం॥రాలు నిండినచో మాచే నిర్వహించబడుతున్న ప్రవేశారహత పరీక్షలో ఉత్తీర్ణులై బి.ఏ/ బి.కాం తెలుగు మీడియంలో ప్రవేశం పొందవచ్చును. 2002 నుండి 2006 వరకు గతంలో నిర్వహించిన ప్రవేశార్హత పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు లేదా ఇంటర్మీడియేట్, తత్సమాన కోర్సు పాసైనవారు అర్హత పరీక్ష వ్రాయనవసరం లేదు. నేరుగా ప్రవేశం పొందవచ్చును.

## దరఖాస్తు ఫారములు లభించు కేంద్రాలు:

వరంగల్:
1. ఎస్.డి.ఎల్.సి.ఇ., కె.యు. వరంగల్
2. ప్రభుత్వ జూనియర్ కళాశాల, హన్మకొండ
3. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మహబూబాబాద్
4. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నర్సంపేట
5. కాకతీయ డిగ్రీ కళాశాల, తొర్రూరు
6. డా॥ఎం.ఆర్. రెడ్డి కళాశాల, పరకాల
7. ప్రభుత్వ జూనియర్ కళాశాల ఎటూరునాగారం
8. ఎస్‌విఎస్‌ఎ కళాశాల, స్టేషన్‌రోడ్, వరంగల్
9. ఎఎస్ఎం మహిళా డిగ్రీ కళాశాల, ఫోర్ట్ రోడ్, వరంగల్
10. ఎవివి డిగ్రీ కళాశాల, వరంగల్
11. తేజస్విని (గాంధీ) జూనియర్ కాలేజీ, భూపాలపల్లి
12. ప్రతిభ ఎడ్యుకేషన్ అకాడమీ, జనగాం
13. జయ డిగ్రీ కాలేజ్, నక్కలగుట్ట, హన్మకొండ
14. మోరల్ బేసిక్ జూనియర్ కాలేజ్, నల్లబెల్లి
15. హర్షవర్ధన్ జూ॥కాలేజ్, నెక్కొండ(స్టే), వరంగల్

ఖమ్మం:
16. ssr&j ఆర్ట్స్&సైన్స్ డిగ్రీ కళాశాల, ఖమ్మం
17. JVR డిగ్రీ కళాశాల, సత్తుపల్లి
18. ప్రభుత్వ డిగ్రీ కళాశాల , భద్రాచలం
19. మధర్ థెరిసా డిగ్రీ కాలేజ్, భద్రాచలం
20. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఇల్లందు

కరీంనగర్:
21. ప్రభుత్వ బాలుర జూ॥ కళాశాల, (ఆర్ట్స్) కరీంనగరం
22. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గోదావరి ఖని
23 ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జమ్మికుంట
24. ప్రభుత్వ జూనియర్ కళాశాల, హుజురాబాద్
25. ప్రభుత్వ జూనియర్ కళాశాల, హుస్నాబాద్
26. ప్రభుత్వ జూనియర్ కళాశాల, సిరిసిల్ల
27. ప్రభుత్వ జూనియర్ కళాశాల, కోరుట్ల
28. SKNR ప్రభుత్వ జూ॥ కాలేజ్ (బాలుర), జగిత్యాల
29. జవహర్‌లాల్ నెహ్రూ డిగ్రీ కళాశాల, మార్కెట్ రోడ్, వేములవాడ
30. గాయత్రి డిగ్రీ కాలేజ్, పెద్దపల్లి
31. ప్రగతి జూ॥కాలేజ్,గోపాల్‌రావుపేట, మ॥రామడుగు

ఆదిలాబాద్:
32. MAM&MVN డిగ్రీ కళాశాల, మంచిర్యాల
34. Univ. P.G. కాలేజ్, నిర్మల్
35. ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఉట్నూరు
36. ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, ఆదిలాబాద్
37. శివాణీ ఆర్ట్స్ అండ్ సైన్స్ డిగ్రీ కాలేజ్, మందుమర్రి
38. .......... డిగ్రీ కాలేజ్, సిర్‌పూర్ కాగజ్‌నగర్

నిజామాబాద్:
39. ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల, నిజామాబాద్
40. కర్షక్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కామారెడ్డి

నల్గొండ:
41. నాగార్జున జూ॥&డిగ్రీ కళాశాల, మిర్యాలగూడ
42. విజయ లా కాలేజ్, నల్గొండ
43. నలందా కో-ఆపరేటివ్ జూ॥కాలేజ్, రామన్నపేట
44వి.సి. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, సూర్యాపేట

మహబూబ్‌నగర్:
45. స్వాతి వివేకానంద డిగ్రీ కాలేజ్, మహబూబ్‌నగర్
46. గాయత్రి డిగ్రీ కాలేజ్, వనపర్తి
47. జాగృతి డిగ్రీ కాలేజ్, షాద్‌నగర్, మ॥ నగర్

హైద్రాబాద్, రంగారెడ్డి:
48. న్యూ సైన్స్ డిగ్రీ కాలేజ్, అమీర్‌పేట్
49. శ్రీత్రివేణి బాలికల జూనియర్ కాళాశాల, అష్టలక్ష్మి దేవాలయం అర్చిఎదురుగా, కొత్తపేట, దిల్‌సుక్‌నగర్
50. జాగృతి పి.జి అండ్ డిగ్రీ కాలేజ్, నారాయణగూడ
51. మేఘన డిగ్రీ కాలేజ్, దిల్‌సుక్‌నగర్
52. సింధూ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమెన్స్, మోహదీపట్నం
53. సర్ న్యూటన్స్ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమెన్స్,మలక్‌పేట్
54. న్యూ సిల్వర్‌జూబ్లీ డిగ్రీ కాలేజ్, కుషాయిగూడ
55. శ్రీసాయి డిగ్రీ కాలేజ్, తాండూరు
56. రెడ్‌సన్ డిగ్రీ కాలేజ్ (వుమన్), మేడ్చల్
57. శాంతి డిగ్రీ కాలేజ్, KPHB
58. వివేకానంద డిగ్రీ కాలేజ్, కూకట్‌పల్లి
59. SRM వొకేషనల్ జూ॥కాలేజ్, ఎస్.ఆర్.నగర్
60. విక్టోరియా వొకేషనల్ జూ॥కాలేజ్, వె.మారేడ్‌పల్లి పోలీస్ స్టేషన్ ప్రక్కన

మెదక్:
61. బి.ఆయం.ఆర్. డిగ్రీ కాలేజ్, సిద్ధిపేట

గుంటూరు:
62. శ్రీవేంకటేశ్వర డిగ్రీ కళాశాల, కొల్లిపర
63. కెరీర్ డిగ్రీ కాలేజ్, బ్రాడిపేట, గుంటూరు
64. ఎం.ఎస్.రెడ్డి జూనియర్ కాలేజ్, మొదుకూరు

చిత్తూరు:
65. కె.ఆర్.సి డిగ్రీ కాలేజ్, తిరుపతి

కృష్ణ:
66. SLR ప్రతిభ మోడల్ డిగ్రీ కళాశాల, తిరువూరు

పశ్చిమ గోదావరి:
67. ఎస్.ఆర్.సి జూ॥ కాలేజ్, తాడేపల్లి గూడెం
68. కార్నర్ స్టోన్ జూనియర్ కాలేజ్ పాలకొల్లు
69. అమూల్య వొకేషనల్ జూ॥ కాలేజ్, నల్లజెర్ల

తూర్పు గోదావరి:
70. ఆదర్శ వొకేషనల్ జూ॥ కాలేజ్, కాకినాడ
71. శ్రీమతి దాసరి అరవాలమ్మ డిగ్రీ కాలేజ్, కోరుకొండ

ప్రకాశం:
72. ఎస్.జి.పి జూనియర్ కాలేజ్, పొదిలిరోడ్, దర్శి
73. శ్రీసిద్ధార్థ జూనియర్ కాలేజ్, బేస్తవారి పేట

నెల్లూరు:
74. Dr.CRR Arts&Sci.Jr.College, సైదాపురం

అనంతపురం:
75. ఎస్.డి.ఆర్.ఆర్ డీగ్రీ కళాశాల, ముదిగుబ్బ

కడప:
76. శ్రీవెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్&కంప్యూటర్ సైన్స్, ప్రొద్దుటూరు

కర్నూలు:
77. విజ్ఞానవర్ధిని జూనియర్ కాలేజ్, నంద్యాల
78. కెయన్‌ఆర్ మెమోరియల్ జూ॥ కాలేజ్, కర్నూలు

విశాఖపట్టణం:
79. శ్రీకనకమహాలక్ష్మి ఆర్ట్స్ అండ్ సైన్స్ డిగ్రీ కాలేజ్, విశాఖపట్నం
80. ప్రెసిడెన్సీ డిగ్రీ కాలేజ్, ఫోర్ట్‌రోడ్, విశాఖపట్నం

వెస్ట్ బెంగాల్:
81. హోలి క్రాస్ మిషన్ స్కూల్, బనమాలి, 19/2 నస్కర్‌రోడ్, కలకత్తా

గుజరాత్:
82. సర్వజనిక్ హైస్కూల్, ప్రతాప్‌నగర్, నవనగర్, సంచాలిత్, సూరత్

మహారాష్ట్ర:
83. St. Francis కాలేజ్, రామగఢ్, గోశాలరోడ్, ములుండ్ (వెస్ట్), ముంబాయి

**పైన పేర్కొన్న ఏ కేంద్రంలో పరీక్ష వ్రాసినప్పటికీ ఎస్.డి.ఎల్.సి.ఇ. లోని అన్ని విద్యా కేంద్రాలలో ఎక్కడైనా అడ్మిషన్ పొందవచ్చును.**

**దరఖాస్తు ఫారాల విక్రయం: 09.03.2007 నుండి 02.05.2007 వరకు**

**పూర్తి చేసిన దరఖాస్తు ఫారముల స్వీకరణ: 04.05.2007 వరకు**

దరఖాస్తు ఫారమును రూ॥ 175/లు చెల్లించిపై కేంద్రాల నుండి గానీ లేదా కేంద్ర కార్యాలయం నుండి గానీ స్వయంగా పొందవచ్చును. లేదా రిజిష్టర్ పోస్టు ద్వారా రూ॥ 225/ రిజిస్ట్రార్, ఎస్.డి.ఎల్.సి.ఇ., కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ పేరిట వరంగల్‌లో చెల్లింపు పద్ధతిపై SBH/SBI/ Andhra Bank లలో తీసిన డి.డి. మాత్రమే పంపించి కేంద్ర కార్యాలయం నుండి పొందవచ్చును. మనీ ఆర్డర్స్ / పోస్టల్ / చెక్కులు స్వీకరించబడవు. మిగతా వివరాలకు ప్రాస్పెక్టస్ చూడగలరు. కేంద్ర కార్యాలయానికి ప్రతి గురువారం మరియు ప్రతి నెల మూడవ బుధవారం సెలవు దినములు.

ఆచార్య కూరపాటి వెంకటనారాయణ
సంచాలకులు

*No: 752 /DP/SDLCE/KU/2007, Dt. 05.03.2007*

# శకుంతలక్క

- వత్సల

శకుంతలక్క మీకు తెలుసా?

మీకు ఎప్పుడైనా కలలొస్తాయా?

ఆ కలల్లో ఎప్పుడూ - ఎక్కడా తారసపడ్డేదా?

అయినా నా పిచ్చిగాకపోతే ఇవేం ప్రశ్నలు? కదూ?

దాదాపు ముప్ఫై ఏళ్ళ క్రితం... ఏడెనిమిదేళ్ళ వయసున్న నాకు

తనతో ఐదేళ్ళ జీవన బంధం

వేలు పట్టుకు నడచిన అనుబంధం

ఉన్ననాకే...

ఇప్పటికీ ఓ రోజయినా కలలోకి రాలేదు.

నాది అపోహో, అనుమానమో, వాస్తవమో ఉన్న వాళ్ళెవరూ చెప్పరు.

లేని శకుంతలక్కా చెప్పదు.

ఓ ప్రైమరీ హెల్త్ సెంటరూ, అప్పర్ ప్రైమరీ స్కూలు, కో-అపరేటివ్ సొసైటీ, పశువుల ఆసుపత్రి, ఓ ప్రైవేటు అల్లర్లు మిషనూ మొదలైన సౌకర్యాలే కాక 'తిక్కబస్సు'కు నైటుహాల్ట్ సెంటరుగా కూడా ఉండే మా ఊర్లో ఇన్ని ఉన్నా కో- అపరేటివ్ సోర్టు మాత్రం ఓ రెండు మైళ్ళు అవతల ఉండే మరో పల్లెలో ఉండేది.

ఆ సోర్టులో ఇచ్చే చక్కెర, గబ్బు నూనె తేవడానికి సంచీ డబ్బా ఎగేసుకుంటూ అక్కతో తప్ప వేరెవ్వరితోనూ ఎప్పుడూ వెళ్ళని జ్ఞాపకం.

వత్తుగా బోదతో కప్పబడి, రెండు పొడవాటి పంచ అరుగులతో ఓ కొట్టం, దాని ఎదురుగా, నాలుగంకణాల చపుడుమిద్దె, ఓ చేద బావి, వీటి పక్కన కొంత ఖాళీ స్థలం వరకు మా ఇల్లు.

దాని పక్కనే బయట పక్కకు పూతపూయని ఎత్తయిన, కొత్తగా కట్టి, కాంక్రీటు పోసిన తీర్లమిద్దె శకుంతలక్క వాళ్ళది.

ఇంట్లో ఉన్నా, బయట ఉన్నా - మా ఇంట్లోంచి వాళ్ళు - వాళ్ళ ఇంట్లోంచి మేము కనపడేవాళ్ళం నాకు దొరికన ఖాళీ సమయమంతా నేను తనతోనే గడిపేదాన్ని. కారణం,

తన మొహంలో విసుగు, చిరాకు, కోపం, చివరికి అలసట- అనేది కూడా ఒక్కసారైనా నేను చూసినట్లు గుర్తులేదు.

అన్నింటికంటే నాకు తనలో బాగా నచ్చింది. ఏంటంటే - నన్ను ఉత్త నా పేరుతో మాత్రం పిలవడం. ఉత్తపేరు ఏమిటా అని అనుకొంటున్నారా? ఊర్లో అందరూ ఆడపిల్లల పేర్లకు ముందు 'ఓమ్మే' అని మగపిల్లలకు 'ఓప్పా' అనీ పిల్చేవాళ్ళు, నాకెందుకో నన్ను అలా ఎవరు పిల్చినా ఉక్రోషమొచ్చేది. అలా ఎవరు పిల్చినా పలికేదాన్ని కాదు.

కానీ శకుంతలక్క మాత్రం ఒక్కటంటే ఒక్కసారి కూడా - నన్నలా పిలవలేదు. అందుకే ఎక్కువగా తన వెంబడి తిరిగేదాన్ని.

ఎంతలా అంటే... తను నీళ్ళు చేదుతున్నా, వంట చేస్తున్నా, పశువులకు గడ్డివేస్తున్నా, బట్టలుతుకుతున్నా, పాలుపిండుతున్నా... ఇలా ఎన్నని చెప్పను?

ఇన్ని చెబుతున్నా... తన గురించి చెప్పటంలేదు కదూ?

చామన ఛాయతో...

పట్టెడు పసుపు పట్టించుకున్నా వాళ్ళింట్లో ఎవరికీ రానంత మెరుపుతో...

బాగా పొడవయిన నల్లటి, మెత్తటి జుట్టుతో...

తను గంటసేపు రుబ్బి తీసిన శీకాయని ఇంటిల్లిపాది వాడగా మిగిలిన పిప్పినీళ్ళతో తలంటుకునే...

అందంగా మెరిసే పలువరుసతో...

ఇంట్లో అందరూ వాడే జెమిని పళ్లపొడి వాడి కాదు... కేవలం బొగ్గే.

ధృఢంగా, పలుచగా... బాగా పొడవుగా...

అంటే...

అంత ఎత్తయిన దాలమందరం గుండా అక్క భుజాన బిందె ఎత్తుకొని రావాలంటే వరుసగా మూడు దాలమందరాల దగ్గర ఆగి, వంగి రావల్సిందే.

ఇక అక్క వేసుకొనే బట్టలు సంగతి అయితే సరేసరి... అస్సలు చెప్పనక్కరలేదు. రెండే రెండు జతలు... లంగా... ఓణీలు, అవీ... పాపం అంత పొడవయిన అక్కకు కాలి గిటకల వరకే ఉండి పొట్టిగా అనిపించేవి.

పావు క్వింటాలు బస్తాను కూడా సునాయాసంగా ఎత్తేయగల అక్క తినేది మిగిలింది, సగిలింది.

అంటు రోగాలేవీ లేకున్నా...

బొగ్గు, సబ్బు, తలనూనె, తాగే కాఫీ, తినే అన్నం, వేసుకునే మజ్జిగ, కట్టేబట్ట, కప్పుకునే దుప్పటి, ఇలా... అదీ... ఇదీ... ఒక్కటన్న మాటేమిటి... అడుగడుగునా... అనుక్షణం... అక్కను వేరుగా చూసేవాళ్ళు.

అమ్మగారింట్లోనే...

అత్తగారింట్లో కొత్తకోడలిలా...

ఆ ఇంట్లో అందరికంటే ఆలస్యంగా పడుకునేది. తొందరగా లేచేది అక్కే.

కేవలం... కేవలం... అక్కుకున్నది... కాస్త మెల్లకన్నని.

అయితేనేం అవి ఎప్పుడూ పనిని వెతుకుతుండేవి.

వాటిలో నిండుగా పొంగి పొర్లే ఆత్మాభిమానం...

ఎంతలా... అంటే... ఇంట్లో తన పరిస్థితి తెలిసిన వాళ్ళెవరైనా ఏదయినా తినమని పిలిస్తే...

'ససేమిరా'... అనేది వాళ్ళు - ఎంత దగ్గరి వాళ్ళయినా సరే.

ఎందుకనో ఒక్క - 'రెడ్డేరి పెద్దాయమ్మ' దగ్గర తప్ప.

ఆవిడ మాత్రం అదేపనిగా అప్పుడప్పుడూ శకుంతలక్కను పిలిపించుకొని కడుపునిండా భోజనం అక్కడే తినపెట్టి పంపించేది.

అప్పుడప్పుడూ ఏ ఉగాదికో, సంక్రాంతికో ఓ జత బట్టలు కూడా ఇచ్చేది.

ఇస్తూ - ఇవి 'నువ్వు కట్టుకోవడానికే'... అని చెప్పి మరీ పంపేది. ఎక్కడ ఇంట్లో వాళ్ళు తీసేసుకుంటారోననే ఉద్దేశ్యంతో.

అలాంటి అక్కకు...

ఓ రోజు... పెళ్ళి చూపులు...

పాపం అక్క... తన పెళ్ళి చూపులక్కూడా

రాబోయే వాళ్ళకు - తనే మురుకులు, బొండాలు వండి

తర్వాతనే...

వాళ్ళ అక్క ఇచ్చిన ఆకాశం రంగు ఉలీ - ఉలీ చీర,

వాళ్ళమ్మ ఇచ్చిన నల్లపూసల కట్లు-

ఎప్పుడూ పనిచేసి, చేసి మాగిపోయిన గాజులకు మరిన్ని కొత్త ఎర్రని సాదా కటింగ్ గాజులు

దొడ్లో పూసిన కనకాంబరాలు, మరువం కలిపిన అరజానెడు దండ జడలో పెట్టుకొని...

ప్రత్యేక అలంకరణతో...

మొహంలో ఏ మార్పులేని భావంతో...

తర్వాత తంతుమామూలే.

ఒకరు మెల్లకన్ననీ...

మరొకరు ఆడపిల్ల - అంత ఎత్తు ఉంటే ఎలా? అనీ-

కనీసం రంగయినా తెలుపు కాదని-

ఇచ్చేకట్నం సరిపోదని... కొందరూ... వద్దంటున్న సందర్భంలో...

అక్క చేసే చాకిరీ విలువ తెలిసిన ఓ అత్తగారు మాత్రం...

బొట్టు కట్టించి పంపినా చాలని - సంక్రాంతి శూన్యం తరువాత మాటకట్టుకుందాం అని వెళ్ళి పోయింది.

ఇది తెలిసి... 'బిడ్డ అక్కడన్నా సుఖపడితే చాలు- ఏమున్నా లేకున్నా దానిల్లు దానికుంటుంది కదా'

'ఇక్కడ ఓర్చుకున్న దానికంటే ఎక్కువేం ఉంటుందిలే' అని తను వెళ్ళిపోతే చాలన్నట్లు మాట్లాడారే... కాని... చేసుకోబోయే వాడి గురించి ఒక్కరు కూడా ఒక్క మాటా అన్లేదు.

నాకు మాత్రం మనసులో దిగులు పీకుతోంది- అక్క పెళ్ళయి వెళ్ళిపోతుంది. కదా, అని - ఆ దిగుల్తో వీలయినంత ఎక్కువ సేపు తన చుట్టూనే తిరుగుతూ ఉండేదాన్ని.

మేమంతా 'సంక్రాంతి'ని దోశల పండుగ అనేవాళ్ళం.

గొబ్బెమ్మల సందడికంటే ఆ పండుగలో ఓ రెండు వారాల ముందునుంచే-

కసిరెడ్డి తోపుల్లో కోడిపందాలు - గంపలు గంపలుగా పోసిన దోసెలు పశువులకు తినిపించడం

చిట్లాకుప్ప కెళ్ళే పశువుల అలంకరణకు - సిగరెట్టు పెట్టెలోని తగరపు కాగితాల సేకరణ- వాటి జిగజిగ మెరుపుల కలబోతతో తయారుచేసే రంగు రంగుల కాగితపువ్వుల తయారీ - మాకెంతో ఉత్సాహాన్నిచ్చేది. ఆవుల ఎద్దుల కొమ్ములకు కుప్పెలు, గంటలు, రంగురంగుల తగరాలు మెడపట్టీలు కట్టడం, ఎనుముల కొమ్ములకు సున్నం, ఎర్రమన్ను సారలు తీయడం, అబ్బ అన్నీ ఎంత బావుంటాయో?!

ఆ సాయంత్రం ఊరు - ఊరంతా అంత సందడైనా దోశల పండుగకు తయారవుతోంది...

రోటి కుదురు లేకుండా అక్క పిండి దంచుతుంటే - ఎగదోస్తున్న నాకు చెయ్యి రోకలి కిందపడి నలిగింది.

అది మర్చిపోవడానికి అక్క పెట్టిన చెనగ్గింజలు తిని నీళ్ళు త్రాగి ఇంటి కొచ్చేశాను.

కానీ... నాకు అప్పుడు తెలియదు. పొద్దునకంతా తను ఉండదని. కనీసం తనకయినా తెలుసో లేదో?! సరిగా అర్ధరాత్రి అనుకుంటా...

మానాన్న రెండు మూడుసార్లు పెద్దగా శబ్దం చేసే చిలుకు లోపల్నించి తీసి - లాంపు వత్తిని పెద్దగా చేసి బయట నుంచి తలుపు వేసి వెళ్ళిపోయాడు. అలా వెళ్ళడం మా జేజి కంబళ్ళో దూరి పడుకున్న నాకు లీలగా గుర్తుంది.

మా నాన్న అలా వెళ్ళాడో లేదో- వెళ్ళిన కాసేపటికి గొళ్ళున ఏడుపులు విన్పించాయి. భయంతో మరికాస్త ముడుచుకు పడుకున్నా.

కొంచెం సేపు తర్వాత మళ్ళీ మా నాన్న తిరిగి వచ్చి మా జేజిని లేపి-

చెవుడున్న తనకి సైగలతో చెప్పాడు. 'శకుంతల వాంతులు చేసుకొని కాస్సేపటికి చచ్చి పోయిందని'

అరకొరగా అర్థమయిన - మా జేజి మాత్రం - "ఏందిరా అప్పా... రెడ్డీ... ఏమయింది? అసలు? అంటూ వణుకుతూ ఉండే మెడకు, గొంతు కూడా వణకడంతో వెంటనే లేవలేకపోయింది.

మా నాన్నే లేపి ఓ చేత్తో తనని మరో చేత్తో లాంపు పట్టుకుని తీసికెళ్ళాడు.

నేను మా జేజిని గట్టిగా పట్టుకొని-

భయం... భయంగా...

వెళ్తే అక్కడ...

నట్టింట్లో... అప్పుడే... పడుకోపెట్టిన శకుంతలక్క...

కాదు... కాదు... తన శవం...

తల దగ్గర చిన్న నూనె దీపంతో...

అక్కని అలా చూస్తే - ఏడుపురానంత బాధ.

ఆ తర్వాత ఈ విషయం ఇల్లిల్లూ తెలియటం - ఒక్కక్కరే రావటం... ఏడవటం...

'ఎలా జరిగింది? అనటం? ఎవరో ఒకరు. ఒకరి నుండి ఒకరు అందుకున్నట్లూ...

'పొద్దునకి దోశల పిండి దంచిందట - పచ్చడి నూరిందట - గంజి కాచి పిండి కూడా కలిపి పెట్టిందంట- అందరూ అన్నంతిని పండుకున్నారంట. పొద్దున్నే లెయ్యాలని - పండుకున్న కొంచెం సేపటికి ఉన్నట్లుండి రెండుసార్లు వాంతులు చేసుకుందట... నర్సమ్మ (వాళ్ళమ్మ) వచ్చి పట్టుకునే లోపల కాళ్ళు, చేతులు సల్లగయిపోయినాయంట' ఇలా... ఇలా... అందరికీ వినపడేలా... మరుసటి రోజు మిగిలిన అన్నీ అయిపోయాయి.

'పాపమమ్మా బంగారటల్లాంటి బిడ్డ. చెట్టంత బిడ్డ, కన్ను మెల్లయితేనేం గొడ్డు చాకిరీ చేసేది... మిద్దెకు ఇటికెలు, మన్ను, నీళ్ళు అన్నీ బయటి నుంచి ఒక్క కూలోడు లేకుండా అన్నీ ఒక్కతే మోసింది, ఒకనాడూ... రోడ్లో తలెత్తి అన్నా ఎవర్నీ చూసింది కూడా కాదు' ఏదో పెండ్లయి వెళ్ళిపోతుంది గదా అక్కడన్నా సుఖపడ్తుందనుకొన్నా - ఎందుకులే - ఇంక సాలకున్నాదేమో?!... దేవుడు... తీసుకుపోయాడు. ఈడిదాకా చెయ్యాలని రాసుంది... కాబోలు'... ఇలా... ఇలా... రకరకాలుగా... ఒక్కరయినా అక్కని చెడ్డదన్న వాళ్ళు లేరు.

అవన్నీ వింటున్నా నా చిన్న బుర్రలో నాకు నేనే మాట్లాడుకున్నవి.

'సాయంత్రమంతా నేను అక్క దగ్గరే ఉన్నా కదా? నా ఎదురుగా - ఎసురు పెట్టి వండిన అన్నం - పొద్దున దోశల్లోకి నూరిన చనిగ్గింజల పూరిమిండి - అవేగా తిన్నది?

అక్కడ పదిరకాల వంటలూ లేవు.

ఉన్నది అంతా తనొక్కటే తినలేదు.

మరి అందరూ తిన్నది అదే అయితే... ?

అక్కకు మాత్రం వాంతులెట్లా అయినాయి?

వాంతులకే ప్రాణం పోయిందా?

అయినా అంతతొందరగా ఎట్లా ప్రాణం పోయింది?

సమాధానాలు ఎవరు చెప్పాలి? ...

'చచ్చిపోయిన - శకుంతలక్క మనమేదయినా అడిగితే ఎట్లా చెపుతుంది?... అని ఓసారి అమ్మనడిగితే- అమ్మ అంది 'కలలో వచ్చి చెప్తుందిలే' అని.

కానీ నా అనుమానాలన్నీ నిజం చేస్తూ... కొద్ది రోజులకు, ఊళ్ళో మెల్ల మెల్లగా వినపడి, వినపడకుండా ఎవరికి వాళ్ళు పక్కన చెవులు కొరుక్కునే వాళ్ళు...

ఇంకోలా...

'మందు బెట్టి చంపేశారంట - పెండ్లి చెయ్యాల్సొస్తుందని - పెండ్లికి ఖర్చవుతుందని - ఇప్పుడైతే పండగ రచ్చలో ఎవరూ అంతగా పట్టించుకోరని - పట్టించుకొని అడగరని'...

అవన్నీ విన్న నాకు... అప్పుడు నిజం అర్థమయింది...

అక్కని... మా... శకుంతలక్కని చంపేశారని...

తర్వాత వాళ్ళింట్లో ఎవర్ని చూసినా...

వికృతంగా...

అసలే రాక్షసుల్లాంటి వాళ్ళు...

మరింత రాక్షసుల్లా... కనపడేవాళ్ళు.

అప్పట్నుంచి ఇదిగో... ఇలా... కలలో... తన రాకకై ఎదురుచూపు కాలం మరో ఆరేళ్ళు సాగిపోయింది.

కానీ శకుంతలక్క చావుకు కారణాలు... సమస్య... దాని వెనుక ఉన్న సమాజం ఇలాంటివేవీ తెలియదుగా?... అందుకే నా పదమూడేళ్ళ వయసులో అనుకుంటా-

అక్క జ్ఞాపకంగా...

ఆవేదనతో...

కసిగా... నా మొట్టమొదటి కవితరాశా...

'మాతృత్వం'

కాదు కారణం-

ఆపులోలేని 'ఆవేశం'

దానికే ఇస్తోంది...

సమాజం-

'మాతృత్వం' పేరుతో

'ఎనలేని గౌరవం?!' అని...

ఇలా... నా నోటు పుస్తకంలో ఎందుకు రాశానో తెలియని అమ్మ బెడ్‌రోప్‌తో వాతలు తేలాలా కొట్టింది.

సాయంత్రం ఇంటికి వచ్చిన నాన్నకు - అమ్మ నా పుస్తకం చూపెట్టింది.

అది చదివిన నాన్న - ఆవేశంతో... 'చమ్డాలు... వలిచెయ్యాల... దానికి'... అని మళ్ళీ కొట్టడానికి వస్తుంటే...

అమ్మ అడ్డుపడి 'ఇప్పటికే చచ్చేంత అయిందిలే నా చేతిలో మళ్ళీ నువ్వెందుకు? అంటూ ఆపింది.

బలవంతంగా - ఆవేశం ఆపుకుంటూ-

నాన్న - అన్నాడూ... 'ఇది... పనికి... రాదే... అని"...

'ఎందుకు నాన్నా?! అని

అప్పుడే కాదు...

ఇప్పటికీ...

అడగలేకున్నా...

# విముక్తి పోరాటంలో పత్రికల సేవలు

- వేములపల్లి సత్యవతి

నిజాం నవాబు పాలనలో హైదరాబాద్ పట్టణం నుండి మూడు తెలుగు దిన పత్రికలు వెలువడేవి. మొదటిది 'గోలకొండ' పత్రిక. దానికి సురవరం ప్రతాపరెడ్డి గారు సంపాదకులు. గ్రామ ప్రజలు చదివే ఏకైక తెలుగు పత్రిక గోలకొండ. రెండవది 'తెలంగాణ'. బుక్కపట్నం రామానుజా చార్యుల వారు దానికి సంపాదకులు. మూడవది 'మీజాన్' ఈ పత్రిక ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు మూడు భాషలలోను ప్రచురించబడేది. తెలుగు 'మిజాన్'కు అడవి బాపిరాజుగారు సంపాదకులు. ఈ మూడు పత్రికలు ప్రజల సమస్యలకు ప్రాధాన్యత నిచ్చి వార్తలు ప్రచురించేవి. అంతేగాక తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమం ఉధృతంగా వున్న రోజుల్లో ఉద్యమ వార్తలకు కూడా ప్రాధాన్యత నిచ్చి ప్రచురించేవి. పత్రికాధిపతులు ప్రభుత్వ నిర్బంధాలను, వ్యతిరేకతలను, ఆర్థికపరమైన యిబ్బందులను ఎదుర్కొంటూ మొక్కవోని ధైర్య సాహసాలతో ప్రజల శ్రేయస్సే ధ్యేయంగా పెట్టుకొని పత్రికలను నడిపారు. ఆ పత్రికలలో వార్తల మీద నిజాం ప్రభువు వందిమాగధులు, మత దురహంకారులు కారాలు- మిరియాలు నూరుతూ కత్తులు దూస్తూ వుండేవారు. అయినా పత్రికాధిపతులు వెనుకంజ వేయకుండ నిజాం పాలకుల వలన తమ సర్వస్వం కోల్పోయిన, బాధాసర్పదష్టుల, అణగ ద్రొక్కబడిన దళితుల, పీడితుల, బాధితుల తరపున నిలిచారు. వారితోపాటు ఆ పత్రికలలో పనిచేసిన విలేఖరులు కూడ తమ ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని దినదినగండం, నూరేళ్ల ఆయుష్షులాగ పనిచేశారు. వాస్తవ విషయాలను సేకరించటానికి గ్రామాలలో తిరగవలసి వచ్చేది. ఒక ప్రక్క అధికారుల, పోలీసుల జులుంను ఎదుర్కొంటూ, మరోప్రక్క రజాకార్ ముష్కరుల నుండి ప్రాణాలను కాపాడుకుంటూ నిజానిజాలను నిగ్గుతేలుస్తూ వార్తలు సేకరించేవారు. ఒక్కోసారి తిండి తిప్పలు లేకుండ వుండేవారు.

**గోలకొండ, తెలంగాణా,**

**మీజాన్, పయాం, తేజ్,**

**నియాత్, ఫతేపూర్,**

ఉర్దూ భాషలో వెలువడే కొన్ని పత్రికలు నిజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా, రజాకార్ల దురాగతాలను ఖండిస్తూ వార్తలు ప్రచురించేవి. వాటిలో చెప్పుకోదగినవి పయాం, తేజ్, నియాత్, ఫతేపూర్, నిగార్, రయ్యత్, ఇమరాజ్ పత్రికలు. ఫతేపూర్, నిగార్ పత్రికలు ముస్లిం యువతలో హేతువాద భావాలు కల్గించటానికి కృషి చేశాయి. కొంతమంది ముస్లిం యువకులను ప్రభావితం చేశాయి. చైతన్యవంతులను చేశాయి. 'రయ్యత్' ఉర్దూ పత్రికా సంపాదకులు మందుముల నరసింగరావు గారు నిజాం పాలనకు వ్యతిరేకంగా వార్తలు, వ్యాసాలు ప్రచురిస్తున్నందువలన 'రయ్యత్‌ను, నిగార్‌ను నిజాం సర్కారు నిషేధించింది. 'ఇమరాజ్' పత్రిక సంపాదకుడు షోయబుల్లాఖాన్ దేశభక్తుడు. గొప్ప జాతీయవాది. ఖడ్గం కన్నా కలం గొప్పదని తన రచనల ద్వారా నిరూపించాడు. పెన్నునే గన్నుగా మార్చి రజాకార్ల పాశవిక చర్యలను, దురాగతాలను నిర్భయంగా, నిస్సంకోచంగా ఏకి పారేశాడు. వాటిని సహించలేని రజాకార్ ముష్కరులు కాపుగాసి, మాటువేసి నిష్కళంక దేశభక్తుడిని హత్యచేశారు. షోయబ్ తలను, చేతులను నరికి ఒక పళ్లెంలో పెట్టి ఖాసిం రజ్వాకి కానుకగా సమర్పించారు. 'ప్రజ' అనే పత్రికా సంపాదకుడు సంస్థానం నుండి రహస్యంగా బయటకు వెళ్లి ప్రాణాలు కాపాడుకున్నాడు. దక్కన్ క్రానికల్, గోలకొండ, ఇమరాజ్, డైలీన్యూస్ పత్రికలు సెన్సారుకు గురయ్యాయి. ఇంత దారుణమైన గడ్డు పరిస్థితుల్లో కూడ ఆర్యభాను, దక్కన్ క్రానికల్, గొలకొండ పత్రికలు ప్రజల ఆదరాభిమానాలను మరింత చూరగొన్నాయి. ఆర్థికంగా ఎంతగానో నష్టపోయాయి. వాటిల్లో పనిజేసే విలేఖరులు కూడ భయపడి వెళ్లి పోకుండ నిలబడి వనిచేసి ఉద్యమానికి సహకరించారు. వారి సేవలు ప్రశంసనీయమైనవి. 'సుబాహె దక్కన్', నిజాంగెజిట్', 'రహబారే దక్కన్' ఈ మూడు పత్రికలు నిజాంకు అనుకూలంగా వుండేవి. వాస్తవాలను వక్రీకరించి వార్తలు ప్రచురించేవి.

**హిందు,**

**నిగార్, రయ్యత్, ఇమరాజ్,**

**ఆర్య భాను, దక్కన్ క్రానికల్,**

సంస్థానం వెలుపల నుంచి అనేక ప్రాంతాల నుండి అనేక భాషా పత్రికలు, హైదరాబాద్ విమోచనోద్యమానికి అన్ని విధాల చేయూతనిచ్చి, సహాయం, సహకారాలందించాయి. ఉద్యమానికి తోడ్పడ్డాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక గణనీయమైన తోడ్పాటు నందజేశాయి. హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, టైమ్స్ ఆఫ్ ఇండియా, సంయుక్త కర్నాటక, విజయ కర్నాటక, బాంబే క్రానికల్, మారాఠీ కేసరి, కాల్, నవకాల్, సకాల్, విశ్వామిత్ర వంటి పత్రికలు, ముంబాయి, మద్రాసు, ఢిల్లీ నుంచి వెలువడే పత్రికలు హిందూస్తాన్ టైమ్స్ పత్రికలు కూడ నిజాంకు వ్యతిరేకంగా ఉద్యమానికి అనుకూలంగా వార్తలు ప్రచురించేవి. బయట నుంచి వెలువడే ఆ పత్రికలతో పాటు విజయవాడ నుండి వెలువడే ప్రజాశక్తి వత్రిక కూడ హైదరాబాద్ సంస్థాన ప్రజల మనోధైర్యాలు చెక్కు చెదరకుండా చేదోడు వాదోడుగా నిలబడింది. సంస్థానంలో నెలకొన్న భయంకరమైన అనిశ్చిత వాతావరణానికి భయపడి తమ

**ఇండియన్ ఎక్స్‌ప్రెస్,**

**ప్రజాశక్తి**

ఉద్యోగాలను వదలి వెళ్లకుండ సంస్థానంలోని విలేఖరులు కూడ ఎంతో చిత్తశుద్ధితో తమ విధులను సక్రమంగా నిర్వహించి పోరాట విజయానికి తోడ్పడ్డారు. సంస్థానం వెలుపల నుంచి వచ్చే అన్ని పత్రికలను నిజాం సర్కారు నిషేధించింది.

1947లో నిజాం సర్కారును కూలద్రోయాలని, సరిహద్దు పోరాట ఉద్యమం నడపాలని స్టేట్ కాంగ్రెస్ నిర్ణయించింది. మూడు భాషా ప్రాంతాలకు (మరాఠీ, కన్నడ, తెలంగాణ) ప్రాంతీయ కార్యాలయాలు ఏర్పడినవి. తెలంగాణా ప్రాంతీయ కమిటి కార్యాలయం విజయవాడలో ఏర్పాటు చేశారు. దానికి టి. హయగ్రీవాచారిగారు, వి.బి. రాజుగారు, బొమ్మకంటి సత్యనారాయణగారు నిర్వాహకులుగా పని చేశారు. ఈ కమిటి ఆధ్వర్యంలో సరిహద్దు గ్రామాల ప్రజలు కాంగ్రెస్, కమ్యూనిస్టులనే తేడా లేకుండ ఆదరణతో, అభిమానంతో ఆదరించారు. ఆర్థిక తోడ్పాటుకు శిబిరాలు ఏర్పాటు చేసుకున్నవారితో కలసి విరాళాలు సేకరించారు. ప్రత్యేక తెలంగాణా అని గొంతు చించుకునే వేర్పాటు వాదులు హైదరాబాద్ విమోచనోద్యమ పోరాట చరిత్ర పుటలను ఒకసారి తిరగేస్తే బయట ప్రజల అండదండలు ఎంతగా తోడ్పడినాయో తెలుస్తుంది. విమోచనం తర్వాత మరాఠీ అయిదు జిల్లాలు, కన్నడ మూడు జిల్లాలు ఆయా రాష్ట్రాలలో విలీనం చేయబడ్డాయి. ఆ జిల్లాలు కూడ ప్రత్యేక తెలంగాణ మాదిరిగా తమతమ రాష్ట్రాల నుంచి వెనుకబడ్డామన్న నినాదంతో వేర్పాటు వాదాన్ని లేవనెత్త లేదు. వెనుకబాటు తనమన్నది దేశంలో అన్ని రాష్ట్రాలలోను, అన్ని ప్రాంతాలలోను ఏదో ఒకచోట వుండనే వున్నది. రాష్ట్రానికి, రాష్ట్రానికి మధ్య, జిల్లాకి, జిల్లాకి మధ్య, గ్రామానికి గ్రామానికి మధ్య అసమానతలు-సమానతలు వుండనే వుంటాయి. ప్రత్యేక తెలంగాణ ఏర్పడితే ఈ వేర్పాటు వాదులు తెలంగాణాలో ఒక్క అంగుళం భూమిని కూడ వదలకుండ, సారవంతంగాను, సస్యశ్యామలంగాను చేయ గల్గుతారా? స్వార్థ రాజకీయ ప్రయోజనాలకు, పదవీ వ్యామోహాలకు లోనై తెలుగు భాషామతల్లిని రెండు ముక్కలు చేయాలని కొందరు, రాయలసీమను వేరు చేయాలని కొందరంటే, ఉత్తరాంధ్ర (విజయనగరం, శ్రీకాకుళం)లతో కళింగ దేశాన్ని చేయాలని మరి కొందరు గళం విప్పుతున్నారు. మద్రాసు రాష్ట్రంలోను, దత్తమండలాలలోను, తెలంగాణాలోను మూడు చోట్ల వేరువేరుగా వున్న తెలుగు బిడ్డలందరూ ఏకమవటానికి, ఒక రాష్ట్రంగా ఏర్పడటానికి ఎన్ని పోరాటాలు నడిపారో, ఎన్ని ఉద్యమాలు నిర్వహించారో మరచిపోతే ఎట్లా? గతం లేకుండ వర్తమానం వుండదు. వర్తమానం లేకుండ భవిష్యత్ వుండదు. గతాన్ని మరచిపోయి పొట్టి శ్రీరాములు ప్రాణత్యాగంతో సాధించుకున్న తెలుగు రాష్ట్రాన్ని ముక్కలు ముక్కలుగా చేయాలనటం కడు శోచనీయమైన విషయం. తెలుగు బిడ్డలు ఏకం కావటానికి చేసిన పోరాటాల స్థానంలో నేడు వేరు పడటానికి రక్తం చిందించే పరిస్థితులు దాపురించాయి. ఏది ఏమైనా హైదరాబాద్ విముక్తి పోరాట చరిత్రలో పత్రికల, పత్రికాధిపతుల, విలేఖరుల అమ్యూలమైన సేవలు సువర్ణాక్షరాలతో లిఖింపదగినవి.

**టైమ్స్ ఆఫ్ ఇండియా, కాల్,**

**నవకాల్, సకాల్**



## మండుతున్న దశాబ్ధ... దేశమిది!

వంటిమీద వస్త్రాలు భగ్గునమండుతున్న దశాబ్దమిది.
వంటిమీద వస్త్రాలులేని మహాత్ముడే కనుమరుగవుతున్న దశాబ్దమిది.

మనిషంటే మనిషే భయపడుతున్న దశాబ్ధమిది.
ఎవరెందుకు భయపడుతున్నారో
ఎవరెందుకు బ్రతుకుతున్నారో
ఎవరెందుకు చస్తున్నారో
అయోమయం... అఘత్వం... అవధ్యం... అవుతున్న దశాబ్దమిది.
- ఇది మండుతున్న దశాబ్ధమిది -
... ... ...
రాముడేలేడు రామమందిరం కావాలట యిప్పుడు
లక్ష్మణుడే రావణుడైన 'స్వర్ణ' లంకా దేశమిది రావణదశాబ్దమిది
జై హనుమంతుడే రాముణ్ణి మరిచిన... మార్చిన దశాబ్దమిది
రాముడే సీతను హతమార్చుతున్న దేశమిది
- ఇది మండుతున్న దశాబ్ధమిది -
- ఇది మండుతున్న దేశమిది -
... ... ...
ధర్మజుడే రారాజైన 'కౌరవ' రాజ్యమిది
వస్త్రాలులేని ద్రౌపది దృశ్యం
నందనందనుకే గీతోపదేశం
ఒక్కొక్కడు ఒక నరహంతకుడే
ధృత రాష్ట్రుని సుపుత్ర

మాయసభల శాసన సభల అతి పెద్ద
ప్రజాస్వామ్య ఇంద్రజాల మహేంద్రజాలమిది
ఎన్ను'కొన్న' ఒక్కొక్కడు ఒక
శకుని స్వభావాల వారస 'ప్రతి' నిధుల్

నిత్యం రుషుల యాగభంగ దృశ్యదశాబ్ధమిది
నిత్యం రాక్షసుల మారణహోమంతో మండుతున్న దేశమిది
ఇది మనుసులు కరగని దశాబ్దమిది
ఇది మనుషులు కరువవుతున్న దేశమిది

- ఇది మండుతున్న దశాబ్దమిది -
- ఇది మండుతున్న దేశమిది -
... ... ...

- జనజ్వాల



- వి.వి.జ్యోతి

# మీడియాదీ మృగ దృష్టే

"అబ్బా! ఎంత ఘోరంగా చంపారో కదా!" అన్న స్నేహితురాలితో "ఘోరమే కానీ ఆ అమ్మాయి మాత్రం వాడి దగ్గర నుంచి అన్నేసి డబ్బులు తీసుకోవడం ఎందుకు? ప్రేమికుడే అయినా సరే అతని డబ్బు మీద ఆధారపడడం ఎందకు? తను సంపాదించుకున్న దాంతో బతకొచ్చుగా" అన్నాను.

"అసలు ఈ అమ్మాయిలు ఇంత డబ్బు ఖర్చు పెట్టాలని ఎందుకనుకుంటున్నారు? ఖరీదైన రెస్టారెంట్లకు వెళ్లాలని, ఖరీదైన వేషధారణ కావాలని కెరీర్ మొదట్లోనే ఆశపడడం, దాని కోసం వేరే వాళ్ళ మీద ఆధారపడడం... ఇంత ఆత్రం ఎందుకు?" అన్నారు మరో సీనియర్ జర్నలిస్టు.

ఈ వ్యాఖ్యలు ఈ సంవత్సరం ఫిబ్రవరిలో హత్యకు గురయిన తేజ న్యూస్ ఛానెల్ న్యూస్ రీడర్ లక్ష్మీ సుజాత గురించి చేసినవి. ఆమె హత్యకు సంబంధించి వచ్చిన తొలి వార్తలు చదివి ఆ వ్యాఖ్యలు చేసిన మేమిద్దరం మహిళలం. జండర్ స్పృహ ఉన్నవాళ్ళంగా మమ్మల్ని మేం గుర్తించుకునేవాళ్ళం. పైగా మీడియాలో పని చేస్తున్న వాళ్ళం కూడా. విశ్లేషణాత్మకంగా పరిశీలిస్తున్నామనుకునే వారిలోనే ఇలాంటి అభిప్రాయాల్ని కలగజేయ గలిగింది మీడియా. అది ఎంతటి శక్తివంతమైనదో ఎంతటి దుష్ఫలితాల్ని ఇవ్వగలదో సరికొత్తగా నాకు అనుభవంలోకి వచ్చింది.

**ప్రేమ పేరిట మోసం!**

న్యూస్ రీడర్ హత్యకు ఇదే కారణమా? ◆ నిందితుల గుర్తింపు

"ఖరీదైన సరదాల కోసం, డబ్బు కోసం మగవాళ్ళతో స్నేహం చేస్తుంది. మోజు – తగ్గగానే, లేదా అవసరం తీరగానే బాయ్ ఫ్రెండ్స్‌ని చెప్పులు మార్చినట్లు మారుస్తుంది. ఆ అమ్మాయి మోసం చేయబట్టే తట్టుకోలేక ఆ అమ్మాయిని ప్రేమించినవాడు హత్య చేశాడు" ఇదీ స్థూలంగా మీడియా లక్ష్మీ సుజాత గురించి పాఠకుల్లో, ప్రేక్షకుల్లో కలిగించిన అభిప్రాయం.

న్యూస్ రీడర్‌గా, రేడియో జాకీగా ఒకేసారి రెండు మూడు ఉద్యోగాలు చేస్తూ, మరోపక్క ఎం.బి.ఎ చదువుతూ, సివిల్స్ పరీక్షల కోసం కోచింగ్ తీసుకునే ప్రయత్నాల్లో ఉన్న లక్ష్మీ సుజాత జీవితంలో పై కెదగాలన్న లక్ష్యం పెట్టుకుని అందుకోసం కష్టపడుతోందని ఒక్కరైనా రాశారా? ఈ విషయాలు తెలుసుకోవడానికి ఆమె 'ప్రేమకలాపాలు' తెలుసుకోవడానికి పడాల్సినంత కష్టం కూడా పడనక్కర్లేదు. అందమైన అమ్మాయిల్ని చూడగానే చొంగ కార్చుకునే వెధవల్ని లొంగదీసుకుందామని ప్రయత్నించి విఫలమైన ప్రబుద్ధుల్ని కాకుండా ఆమె సహోద్యోగులలో శ్రమకి, వ్యక్తిత్వానికి విలువిచ్చే ఎవరిని అడిగినా చెప్పి ఉండేవాళ్ళు.

ఈనాడు పత్రికలో 'ప్రేమ పేరిట మోసం' న్యూస్ రీడర్ హత్యకు ఇదే కారణమా? అనే హెడ్డింగ్‌తో జవాబు చెప్పడానికి ఈ లోకంలో లేని లక్ష్మి సుజాత మీద నీచమైన ఆరోపణలతో ఒక వార్తను రాసింది. అసలు ఆ వార్తలో రాసినవన్నీ తప్పులే. నిరాశకు గురైన ముగ్గురు 'భగ్న ప్రేమికులు' కలిసి హత్య చేశారని, వారిని పోలీసులు పట్టుకున్నారని రాశారు. నిజానికి హత్య చేసిన చోట ఉన్నది ఇద్దరే. వారిలో కూడా కత్తితో పొడిచింది ఒక్కడే.

'భగ్న ప్రేమికులు', 'ప్రేమ బాధితులు' అంటూ కిరాతకంగా హత్య చేసినవాడి మీద సానుభూతి కలిగేలాగా, ప్రేమ పేరిట 'మోసం' చేసిందంటూ హత్యకు గురైన అమ్మాయి గురించి అవమానకరంగా రాశారు. భగ్న ప్రేమికులే ఆమెను చంపేసినట్లు తెలుస్తోంది అని రాసిన వార్తకు 'ప్రేమ పేరిట మోసం' అని హెడ్డింగ్ పెడితే అర్థం ఏమిటీ? ఎవరి గురించి అయినా కొన్నాళ్ళ పరిచయం తర్వాతేగా కొంచెమైనా తెలిసేది. స్నేహం చేయాలో అక్కర్లేదో మొదటి పరిచయంలోనే నిర్ణయించేసుకోవడం సాధ్యమేనా? పైగా అందమైన అమ్మాయిల చుట్టూ తిరిగే వాళ్ళకు కొదవేమీ ఉండదు. చదివే చోటో పనిచేసే చోటో పలకరించిన వాళ్ళని నువ్వు మగాడివి కాబట్టి నేను మాట్లాడను, దూరంగా ఉండు అంటారా? అలా అనడం ఈ కాలంలో సాధ్యమేనా? పరిచయమైన మగవాళ్ళతో స్నేహంగా ఉంటే తప్పేముంది? స్నేహంగా ఉన్న ప్రతివాళ్ళు తమని ప్రేమించేస్తున్నారనుకుంటే అలా అనుకున్న వారిదే తప్పవుతుంది. 'నేను నిన్ను ప్రేమించడం లేదు' అని స్పష్టంగా చెప్పాక కూడా అది అమ్మాయి చేసిన మోసమవుతుందా? అలా అని ఆ అబ్బాయి అనుకుంటే తిరస్కారాన్ని తట్టుకోలేని ఆక్రోశంగా దాన్ని అర్థం చేసుకోవచ్చు. కాని పాత్రికేయులకు అది మోసంలా కనిపించిందంటే అది ఆడవాళ్ళ పట్ల వాళ్ళకున్న చులకన భావానికి, ఆడవాళ్ళని నిర్ణయాధికారం ఉన్న వ్యక్తులుగా కాక వస్తువుగా, ఆస్తిగా చూసే

వారి దృక్పథానికి అద్దం పడుతుంది. ఎవరితోనైనా నాలుగు సార్లు కలిసి కాఫీ తాగితేనో, కలిసి సినిమా చూస్తేనో వాడు ప్రేమిచాననగానే ఒప్పేసుకోవాలి. లేకపోతే అది మోసం. అప్పుడు ఆ అమ్మాయిని ఏమైనా చేయవచ్చు. ఇలాంటి సందేశాల్ని పత్రికలు, ఛానెళ్లు ఇవ్వకూడదు. కాని లక్ష్మి సుజాత హత్య కేసు గురించి రాసేటప్పుడు ఇలాంటి బాధ్యతారహితమైన వైఖరినే అవలంభించాయి కొన్ని పత్రికలు.

"సుజాతను నేను గాఢంగా ప్రేమించాను. ఆమె నన్ను తన వెంట తిప్పుకుంది. ఐ లవ్ యు చెబితే అలా నిన్ను నేను చూడలేదు. నా తమ్ముడిలా భావించానంది' అన్న పోలీసులు అదుపులో తీసుకున్న ఒకడి మాటలు 'కోట్' చేస్తూ (అవి కూడా పోలీసులు చెప్పినవే) ఇలా మోసపోయిన ముగ్గురే ఆ అమ్మాయిని చంపారు' అని పోలీసులు చెప్పినట్లు ఆ వార్తలో రాశారు. ఒక వేళ అతను చెప్పింది నిజమేననుకున్నా అతను ప్రేమించానన్నాడు కాని ఆమె తనని ప్రేమించిందని అతనూ చెప్పలేదు కదా అతనితో ఆమె చెప్పిందని అతనూ చెప్పలేదు. అలాంటప్పుడు అది మోసమెలా అవుతుంది. రాసినవాళ్ళు, ప్రచురించిన వాళ్ళే చెప్పాలి! బాయ్ ఫ్రెండ్స్ ఉండడాన్ని గొప్పగా బావించేది. తన కోసం వచ్చేవారితో ప్రేమగా మాట్లాడి బాగా ఖర్చు పెట్టించేది. లక్ష్మి సుజాత తమకు దక్కలేదన్న కోపంతో ఎవరో చెపితే ఇలాంటివి రాసేముందు చనిపోయి వివరణ ఇచ్చుకోలేని వ్యక్తి మీద రాస్తున్నామన్న ఆలోచన వారికి రాలేదు. సంయమనంతో రాయాలన్న స్పృహ ఉన్న వారెవ్వరు ఇలాంటివి రాయలేదు. వ్యక్తి మీద రాస్తున్నా మన్న ఆలోచనవారికి రాలేదు.

హత్య చేసినవాడు పట్టుబడిన తర్వాత వచ్చిన వార్త (ఈనాడులోనే)లో హంతకుడి గురించి వర్ణిస్తూ 'ప్రేమించి... మోసపోయిన అని రాశారు. ఆమెను హత్య చేసిన చంద్రశేఖర్ అనే వ్యక్తి ఏడేళ్ళ క్రితం ఇల్లువదిలి హైదరాబాద్ చేరాడు. ఆరేళ్ళ తర్వాత ఊరు వెళ్ళినా పేదరికంలో ఉన్న తల్లిదండ్రులను ఆదుకోకపోగా చెల్లెలి నగలు కుదవ బెట్టి డబ్బులు తీసుకున్నాడు. అలాంటి వ్యక్తి నేను వేలకు వేలు ఆ అమ్మాయికి తెచ్చి ఇచ్చానని చెబితే అందులో నిజమెంత ఉందోనన్న ఒక్క వార్తనూ సందేహం వ్యక్తం చేయలేదు. కొంత డబ్బు లక్ష్మీ సుజాతకు ఇచ్చి ఉంటే ఉండవచ్చు. కాని ఆ అమ్మాయి తనకు దక్కదనగానే ఆ అమ్మాయిని బాండు రాసిమ్మని అడిగాడు. 'బాండు రాసిస్తే నీకు కనిపించను అంటే అందుకు ఒప్పుకుని లాడ్జికి వచ్చిందని అతనే చెప్పాడని రాశారు. అంటే అతనితో తెంచుకునే ప్రయత్నంలో ఆమె ఉందనే కదా అర్థం. తనకి నచ్చని వ్యక్తితో బంధాన్ని (అది స్నేహం కావచ్చు ప్రేమ కావచ్చు) తెంచుకునే హక్కు ఆమెకు లేదా? కొన్నాళ్ల సాన్నిహిత్యం తర్వాత అతనితో తనకు సరిపడదని గ్రహించి ఉండవచ్చు. అందులో తప్పేముంది? తన దగ్గర డబ్బు తీసుకుంది కాబట్టి ఆమె తనదే. ఇంకెవరూ ఆమెకు ఫోన్ కూడా చేయకూడదని అతను కోరుకుంటే అది ప్రేమెలా అవుతుంది? దాన్ని వదిలించుకునే ప్రయత్నం మోసమెలా అవుతుంది.?

"డబ్బు అవసరమైనప్పుడు చందూ దగ్గరకు రావడం, ఆ తర్వాత మాయమవడం మామూలైంది" అని ఈనాడులోనే వచ్చిన మరో వార్తలో రాశారు. ఇదంతా హంతకుడు చెప్పిన దాని ఆధారంగా రాస్తున్నప్పుడు కనీసం 'అతని మాటల్లో... అనైనా రాయాలి. అది నిజంగా జరిగినట్లే రాశారు. ఒక వేళ జరగకపోతే జరగలేదని చెప్పుకోవడానికి ఆ అమ్మాయి బతికిలేదు కదా! మీడియాలో పని చేసే ఆడవాళ్ళ మీద చెడు అభిప్రాయాలు కలగడానికే ఇలాంటి రాతలు ఉపయోగపడుతాయి. అంతేకాదు ఆడవాళ్ళను వస్తువుల్లా చూసి సొంతం చేసుకోవడానికి ప్రయత్నించి దక్కక పోతే చంపడాన్ని కూడా సమర్థించేలా ఉన్నాయి ఈ రాతలు. ఈనాడు గురించే ఇందులో ప్రస్తావించినా మిగిలిన పత్రికలు కూడా ఇందుకు భిన్నంగా ఏమీ లేవు.

ఇక టివి-9 ఛానెల్లో అయితే నడుం కింద నుంచి ఏ ఆచ్ఛాదనా లేని దేహాన్ని యధాతథంగా ప్రతి పావుగంటకొకసారి రోజంతా చూపించారు. అత్యాచారానికి, హత్యకు గురైన ప్రదేశాన్ని అర్ధనగ్నంగా చూపించి వాళ్ళు సాధించాలనుకున్నది ప్రేక్షకాదరణట. అలా చూపించొద్దు, చూడలేకపోతున్నాం అని లక్ష్మి సుజాత పనిచేసిన ఛానెల్ వాళ్ళు ఫోన్ చేస్తే మీడియాకు టి.ఆర్.పి రేటింగ్స్ ఎలా పెరుగుతాయి? అని సమాధానమిచ్చారు. అంటే శవాల మీద కూడా వ్యాపారం చేసుకోవడానికి వెనకాడని దుస్థితికి చేరింది మీడియా. "చిన్న వయసు ఉన్న అమ్మాయిలను యాంకరింగ్‌కి, న్యూస్ రీడింగ్‌కి తీసుకుంటున్నారు. పై కెదగాలన్న ఆశతోను, మీడియా మీద ఉన్న ఆకర్షణతోను వచ్చే అమ్మాయిలకు ఇక్కడ వాతావరణం కొత్త. ఎలా మెలగాలి, ఎలాంటి సమస్యలు వస్తాయి అన్న విషయాల మీద అవగాహన ఉండదు. మేకప్ చేయడానికి వచ్చే అబ్బాయిలు ఈ ఆడపిల్లల ముఖాలకు రంగులు రుద్దుతూ వారికి దగ్గరగా మసిలే అవకాశం ఉంటుంది. వాళ్ళకు వచ్చే ఫోన్లు వింటూ, వ్యక్తిగత విషయాలు కూడా తెలుసుకుంటారు. వారిలో కొందరు స్నేహంగా ఉంటున్నట్లు నటిస్తూ, ఏదో కొద్ది సాయం చేసి, ఆ తర్వాత బ్లాక్ మెయిలింగ్‌కి దిగుతారు. వాళ్ళు చెప్పినట్లు వినకపోతే తమను అందంగా తీర్చిదిద్దరేమోనన్న భయం కూడా అమ్మాయిలను వెంటాడుతుంది. ఛానళ్ళలో యాంకరింగ్, వార్తలు చదివే అమ్మాయిలకు మహిళలతో మేకప్ చేయిస్తే కొంత పరిస్థితి మెరుగవుతుంది. కనీసం ఈ రంగంలోకి వచ్చీరాగానే సమస్యల్లో చిక్కుకోకుండా ఉంటారు. ఓ మహిళా జర్నలిస్టుల సమావేశంలో తేజ న్యూస్ ఛానెల్‌లో రిపోర్టర్‌గా పనిచేసే అజిత చేసిన ప్రతిపాదన ఇది. అక్కడున్న అందరూ అందుకు ఒప్పుకున్నారు.

దీనివల్ల కొంతే ఫలితం ఉంటుందని తెలుసు. అయినా ఆ మాత్రం సాధించగలిగినా ఇంకొందరు లక్ష్మి సుజాతల్ను రక్షించిన వాళ్ళమవుతాం. ఇక మీడియాలో రాతలు, ప్రసారాల విషయానికి వస్తే ఏ ప్రేక్షకుల్ని, పాఠకుల్ని అయితే సాకుగా చూపిస్తున్నారో వారి నుంచే ఒత్తిడి తీసుకువస్తే తప్ప ఈ ధోరణికి అడ్డుకట్టు వేయలేం. అమ్మాయిల్ని అంగడి సరుకులుగా చూపే, ఆడవాళ్ళని కించపరిచే ప్రతి వార్తని కథనాన్ని ప్రసారం చేసే ప్రతి దృశ్యాన్ని ప్రశ్నించే స్థాయికి ప్రేక్షకుల్ని, పాఠకుల్ని తీసుకురావాలి. అందుకోసం ప్రచారోద్యమాన్ని నిర్మించే పని కేవలం మహిళా ఉద్యమానిదే కాదు. ఆరోగ్యకరమైన సమాజాన్ని కోరుకునే వారందరూ అందులో భాగస్వాములు కావాలి. మీడియాలో పనిచేసేవారితో సహా.

✤

# నిన్ను నీవు తెలుసుకో...

- గొల్లపూడి సీతాదేవి

సుగుణ వారం రోజులుగా తీరిక లేకుండా పని చేస్తోంది. ఇటు ఆఫీసులోనూ, అటు అంతర్జాతీయ మహిళాదినోత్సవ వేడుకలు. వకృత్వపు పోటీలు, ప్రధానాంశంగా మహిళలను తయారు చేయడం; ముఖ్యఅతిధుల్ని ఆహ్వానించడం, వారికివ్వవలసిన మెమోంటోలను గిఫ్టలను తెప్పించడం, స్త్రీలను గురించి మహాత్ములు చెప్పిన మంచి మంచి సూక్తులను గోడలకు అందంగా రాయించి అలంకరించడం; స్త్రీలను ఉత్తేజపరిచే పుస్తకాలను లైబ్రరీకోసం కొనడం, సావనీర్ ప్రకటనలు రచనలు సేకరించడం, సుగుణ ఈసారి లేడీస్‌వింగ్‌కి సెక్రటరి. ఆఖరి అంశంగా అనాధ బాలికలకు, వృద్ధాశ్రమానికి వెళ్లి పండ్లు బిస్కెట్లు ఆడవస్తువులు వారికవసరమైన వాటర్ ఫిల్డర్లు, వాషింగ్ మిషన్లు పెద్ద సైజు టివి కొంత నగదు ఇచ్చి వారి మంచి చెడ్డలు కనుక్కొని రావడం. ఏజంట్లు డెవలప్‌మెంట్ ఆఫీసర్లు బ్రాంచి మెనేజర్లు, ఎంప్లాయిస్ వెయ్యిమంది దాకా వుంటారు కనుక సుగుణ అంచనాల మేరకు డబ్బు పోగయింది. పైసా తేడారాకుండా లెక్క రాయడం తెచ్చిన వస్తువుల్ని జాబితాలో చెక్ చేయడం. బిల్లుల్ని జాగ్రత్త చేయడం ప్రతి అంశాన్ని జాగ్రత్తగా ప్లాన్ చేయడంతో అందరూ ఆశ్యర్యపోయేట్లు ఆమె సంతృప్తిమేరకు తోటి ఉద్యోగుల సహకారంతో అంతర్జాతీయ మహిళా దినోత్సవం వైభవంగా జరిగింది.



రెండో రోజు ఉదయం పని మనిషి మాణిక్యం పనికి రాలేదు. 'దీందుంప తెగా చెప్పా పెట్టకుండా మానేస్తుంది. ఎంత ప్రేమగా చూసుకున్నా లాభంలేదు. ఇంట్ల మనిషిలా టిఫెన్లు పెట్టి కాఫీలిచ్చి బట్టలిచ్చి ఏం చేసినా వీళ్లకి బుద్ధిరాదు. చెప్పి మానొచ్చుకదా. స్వగతంలో విసుక్కుంటు అవసరమైన పని చూసుకుని ఆఫీసుకు వెళ్ళింది. అక్కడా విపరీతమైన పని. మార్చి కావడంతో సాయంత్రం ఆలశ్యంగా ఇంటి కొచ్చి మిగిలిన పని చూసుకుని వంటచేసుకుని తినిపడుకునే వేళకు శక్తులు వుడిగినయ్ నిన్నటి 13 రాత్రి సంతోషం వుత్సాహం లేవు. అలసిన శరీరం సోతి పోయింది. ఒళ్లు తెలియని నిద్ర. ఉదయం లేచి గడియారం చూస్తే ఏడు గంటలు. 'అయ్యో ఆఫీసుకు సెలవు పెట్టను వీల్లేదు. బోలెడుపని, ఇటు ఇంట్లనూ పని ఏది వదిలేందుకు వీల్లేదు. అని లేచి చికాగ్గా వంటింట్లకెళ్ళింది. గిన్నెలన్నితోమి శుభ్రంగా అలమారులో వున్నవి. పొయ్యిగట్టు సింక్ శుభ్రంగా కడిగి వున్నవి. డైనింగ్ టేబుల్ తళతళా మెరుస్తోంది. పాలు డికాషన్ సిద్ధంగా వున్నవి. ఇవతలికొస్తే అన్ని గదులు చిమ్మితుడిచి అద్దంలా వున్నవి. బట్టలు దొడ్లో దణ్ణాల మీద ఆరేసి వున్నవి. వాటిల్లో నీళ్లు తాగిన పూల-మొక్కలు పూలతో కళకళ లాడుతున్నయ్. పిల్లలు స్నానం చేసి బట్టలు వేసుకుని చదువుకుంటు వున్నారు. సుందరం పేపరు చూస్తున్నాడు. సుగుణ దిగులంతా తీసేసినట్లుయింది. స్వర్గంలో వున్నట్లు హాయిగావుంది. దీనికంతా కారణం నిన్న తనచేత తిట్లు తిన్న మాణిక్యం మహిమే.

'మాణిక్యానికి నిన్న జ్వరం తగిలిందట, అందుకే రాలేకపోయానని నీకు చెప్పమంది. 'కాఫీ అందుకుంటూ చెప్పాడు సుందరం. సుగుణలో సిగ్గు, బాధ, పశ్చాత్తాపం హృదయాన్ని కలచి వేశాయి. మాణిక్యం ఒక్క రోజు రాకపోతే ఇల్లు అస్తవ్యస్తమవుతుంది. ఆవ్యాకులతతో చాలా విసుక్కుంది. ఇంటాబైటా తను సమర్ధవంతంగా నెగ్గుతు రాగలుగుతుందంటే ఆమె కూడా కారణం. తన నిరంతర నిత్య సహాయకురాలిని మరచిపోయింది. అపరిచిత వ్యక్తుల కోసం బాలికల కోసం తపనపడ్డది. వారికి అన్ని సమకూర్చి సంతోషించింది. నిత్యం తన కళ్లముందే యంత్రంలా పనిచేస్తూ తన కెంతో ఉపకారం చేసే మనిషిని మరచింది. ఇంతకన్న అన్యాయం వుంటుందా? జీతమిస్తున్నాం ఆహారమిస్తున్నాం, మనకవసరం కాని బట్టలిస్తున్నాం సంవత్సరానికో సారి బోనసిస్తున్నాం అనుకుందేకాని, మహిళా వికాసం, మహిళాభివృద్ధి, మహిళా సంక్షేమం కోసం అంతర్జాతీయ మహిళా దినోత్సవం జరుపుకున్న రోజున కనులముందున్న కష్టజీవిని పలకరించి స్వాంతన వచనాలు చెప్పలేకపోయింది. ఉద్యోగం చేసే మహిళల కష్టాల గురించి స్క్రిప్ట్ రాసి రిహార్సల్ చేయించి ప్రదర్శించి భేష్ అన్పించుకొంది. ఇది రాసివేస్తే ఎంత బావుండేదో? సాయంత్రం ఆఫీసు నుంచి వస్తు పండ్లు, బిస్కెట్లు స్వీట్స్ తీసుకుని మాణిక్యం ఇంటికి వెళ్ళింది. ఆమె చేతిలో తెచ్చినవి వుంచి కొంత డబ్బు కూడా ఇచ్చి 'పిల్లలకి కావల్సినవి కొనిపెట్టు మాణిక్యం' అన్నది.

'ఎందుకమ్మా ఇవి ఇప్పుడు విస్మయంగా అన్నది మాణిక్యం. 'మొన్న ఆడవాళ్లందరికి పండుగ, నిన్ను పలకరించడానికి సమయం లేదు. నీ జ్వరం తగ్గిందా? అన్నది ఆప్యాయంగా, 'అప్పుడే తగ్గిపోయిందమ్మా, పనితో మీరు యాతనపడివుంటారు' 'ఫర్వాలేదు మాణిక్యం మనం ఒకరికొకరం సహాయంగా వుండాలి' అన్నది సుగుణ ఉద్వేగంతో.



# వేపచెట్టు

- సుధాకిరణ్.బి.

"అమ్మా ఎక్కడికి...."

"ఇప్పుడే వస్తాను...."

"చెప్పి వెళ్ళవచ్చుగా..."

"నువ్వు... నాన్న ఎక్కడికి వెళ్ళినా నాకు చెబుతున్నారా.... వీడితో గోల ఎందుకు... వేప్పూల్లకిలే" అన్నా....

"అంటే..."

వాడి ప్రశ్నకి కడుపులో దిగులు తన్నుకొచ్చింది. ఉగాది రోజు నాన్నా, నీవు వెళ్ళి కొనుక్కొస్తారుగా పచ్చడికోసం తెల్లపూలు.. అవి పూసే చెట్టునే వేపచెట్టు అంటారు.

ఓస్ అదా! ఇంగ్లీషులో టకటకా దాని పేరు చెప్పాడు.

"వెళ్ళనీరా అమ్మని... ఒకమైలు నడిచినా వేప్పూల్ల కాదు కదా.. వేప పువ్వు కూడా దొరకదు" అంటున్న ఆయన్ను ఉక్రోషంగా చూస్తూ "ఎట్లాగైనా వేప్పూల్లతోనే ఇంట్లోకి వస్తానని శపథం చేసి" నేను బయటకు నడిచా..

శివాలయం దాని ప్రక్కన మార్వాడీలగుడి దాని ముందే కదా చిన్న వేపచెట్టు ఉన్నట్లు గుర్తు. ఇదేంటి ఇక్కడ చెట్టే లేదు. ఒకవేళ పొరపాటుగా వేరే దగ్గరకు వచ్చానా! ఖచ్చితంగా కాదు. ఎందుకంటే ఈ రోడ్డు మీద అనేక వందల సార్లు నడిచి ఉంటాను. ఖచ్చితంగా ఇక్కడే.. నేను ఏ గుడిలోకి వెళ్ళకుండా మధ్యలో నిలబడి ఆలోచిస్తుంటే అక్కడే కూర్చున్న యాచకురాలు "ఏంటమ్మ ఏమి కావాలి" అంది. "అదే ఇక్కడ వేపచెట్టు ఉండాలి కదా!".అన్నా. "అదా.. మొన్నీ మధ్యన గుడిపైన గోపురం మార్చాలని ఇటుకా, సిమెంటు ఈడ పోశారు. దాని మన్ను, మశానం పడి సెట్టు నిలువునా సచ్చిపోనాది.. అయినా ఈ దినాల్లో ఎవరు తల్లీ ఏపచెట్లు పెంచేది." అంటూ అమాయకురాల్ని చూసినట్లు చూసింది. అయినా నామీద జాలి పడ్డట్టు "కొంచెము ముందుకు వెళ్ళి కుడి వైపుకు తిరగండి. ఆడ చెట్టుండాలి". పెట్టకపోయినా పెట్టే యిల్లు చూపించమన్నట్లు... ఆతల్లి చెప్పిన దార్లో బయలుదేరా.. ఎలాగైనా ఈ రోజు వేప్పూల్ల సాధించి తీరాల్సిందే పట్టుదలగా ముందుకు నడిచా.

చిన్నప్పుడు ఎన్ని వేపచెట్లు. అసలు వేపచెట్టు లేని దొడ్డి ఉండేదా. ఊరిబయట చింతల తోపులు, తాటితోపులు.. వాగులు పొంగితే రోడ్డు మీదకు వచ్చే నీళ్ళలో తేలి వచ్చే చెట్లకొమ్మలు.. ఎంటో.. ఒక్క వేప్పూల్ల కోసం ఇంతసేపా! అయినా నా ఆశ తీరలా.. గానుగ చెట్లు రోడ్లుకు అటూ ఇటూ నాటుతున్న ప్రభుత్వం ఎందుకు వేపచెట్లు నాటకూడదూ! అయినా ఈరోజుల్లో అంత శ్రద్ధగా ఎవరు పెంచుతున్నారు. చిన్నప్పుడు ఎండా కాలం వస్తే బాగా మగ్గిన వేపకాయలు ఎరుకుని ఎన్ని తినలేదు. ఎండలు పెరిగేకొద్దీ ఎవరెక్కువ వేపకాయలు పోగేస్తే వాళ్ళే గొప్ప. ఆదివారం ఎండబెట్టిన వేపకాయలు తీసుకుని బండిఅబ్బాయి 50 పైసలు యిస్తే ఎంత సంతోషం. ఆ సంతోషం ఇప్పుడు నాలుగు అంకెల జీతంలో కూడా నేను పొందలేకపోయానన్నది వాస్తవం.



"ఏంటి పిన్ని ఇక్కడ ఉన్నావ్" అంటూ వినిపించిన పలకరింపు నన్ను ఈ లోకంలో పడేసింది. నా కొడుకుని దబాయించి వచ్చిన నాకు వీడితో విషయం చెప్పడానికి కొద్దిగా మొహమాటం. అయినా నాశపథం! విషయం విన్న వాడు ఫకాల్మని నవ్వాడు. "పిన్ని కనపడటం లేదా! ఇక్కడి ఖాళీ స్థలంలో నువ్వనుకునే చెట్లు ఉన్న మాట ఒకప్పటి సంగతి. ఈ స్థలాన్ని మాడైరెక్టర్ కొనేసాడు. ఇక్కడ అమ్మాయిల హాస్టల్ కడతారంట. అయినా నువ్వేంటి పిన్నీ ఇంత అమాయకురాలివి ఏబ్యూటి పార్లర్‌కో, లేకపోతే ఏషాపింగ్ మాల్‌కో వెళితే వేప ప్రొడక్ట్స్ వేప చెట్టుకున్న ఆకులన్ని దొరుకుతాయి. అయినా మన వేప మొక్క పేటెంట్ హక్కుతో బహుళజాతి సంస్థల పెరట్లో చెట్టై విరబూస్తుంటే మనం వేప మొక్కలకోసం వెదుక్కోవాల్సిన దుస్థితిలోకి ఎప్పుడో నెట్టబడ్డాము.. రా..ఇప్పటికే చాలా దూరం నడిచావ్. బండిమీద చూస్తూ వెళదాం. ఇంటి దగ్గర దిగబెడతా"నన్న వాడి మాటలు నన్ను ఆలోచనల్లో పడేశాయి. నాశపథం నాకు గుర్తు లేదు. భవిష్యత్ తరాలు వేపచెట్లని వీడన్నట్లు షాపింగ్ మాల్స్‌లో చూడాల్సిందేనా! బియ్యం పాడవకుండా ఉండాలంటే వేపాకులు కలిపి గాదెల్లో పోసేవారు. నాకు ఆట్లమ్మ పోస్తే వేపాకులు పరిచి దానిమీద పడుకోపెట్టారు. నీళ్ళు పోసే రోజు వేప ఆకు గుజ్జుతో అమ్మ వళ్ళంతా రుద్దీ, రుద్దీ పోయడం అన్నీ, నిన్న మొన్న జరిగిన సంఘటనల్లా కళ్ళముందున్నాయి. ఇదేంటి ఇన్ని రోడ్లు తిరిగినా వేప మొక్కా కనపడలేదు. ఆలోచనల్లో మునిగిపోయిన నేను ఒక్క కుదుపుతో బండి ఆగడంతో ఉలికిపడ్డా."ఎంటిరా బండి అలాఆపావ్..." కొంచెం

కోపంగా అడిగా. "పిన్ని అటు చూడు ..గోడ ప్రక్కన చిన్న మొక్క... కాదు కాదు కొమ్మలన్నీ నరికేసినా 'నాకు యివ్వడమే తెల్సు' అన్నంత ధీమాగా నిలబడిఉన్న వేపమొక్క. ఉత్త కర్రలాగే కనపడింది. దానికి అటూ ఇటు చిన్న చిన్న ఆకులు... "అమ్మయ్య నీకోరిక తీరింది"అన్న వాడి మాటలు నాకు వినపడలేదు. ఒక్క ఉదుటున దాని దగ్గరకు వెళ్ళాను. ఎంత అపురూపంగా అనిపించింది... దాన్ని ఈనె బాగా లేతది. నాలుగు ఆకులే ఉన్నాయి. దాని తుంచాను. ఉన్న ఒక్క పెద్ద ఆకుల ఈనెను తెంపుతుంటే కొద్దిగా గిల్టీఫీలింగ్.

ఇంటి లోపలకి ఆడుగు పెట్టిన నన్ను చూడగానే మావారు ఎంటి రాజి అలా ఉన్నావ్ అంటూ దగ్గరకి వచ్చి నాచేతిలో వేప ఈనె తీసుకున్నాడు. దాన్ని చూసి తండ్రీకొడుకులు ఒకటే నవ్వడం. ... "రెండు గంటలు కష్టపడి ఒక పుల్ల సంపాదించావా" అంటూ... కానీ నాకళ్లలో నీళ్ళు వాళ్ళ జోక్సకి అడ్డుకట్ట వేశాయి. "సారీ అమ్మా నీవు హార్ట్ అవుతావనుకోలేదు..." నాగుండెలో బాధ వీళ్లకి అర్ధం కావడం లేదు. ఫ్యానుగాలి కన్నా వేపగాలి పీల్చడం మంచిదని మమ్మల్ని చిన్నప్పుడు వెన్నెల్లో వెపచెట్టు క్రింద కూర్చోబెట్టి కథలు చెప్పిన అమ్మమ్మ మాటల్లో నిజం ఇప్పుడు తెలుస్తుంది. నాభాధ మావారికి అర్దం అయ్యింది. "నాకు ఈవిషయం తెలుసు రాజీ.. రోడ్ల విస్తరణ పేరుతో చెట్లు కొట్టేసుకుంటూ పోతున్నాము. పెద్ద పెద్ద వృక్షాలు ఇంట్లో పెరిగితే లాన్స్ పాడవుతాయని, వేర్లు గోడల్లోకి వెళ్ళి ఇళ్ళు పాడవుతాయని, ఎప్పుడో వృక్షాలు మరుగుజ్జులైపోయి బోన్సాయ్‌ల పేరుతో కుండీల్లో చేరిపోయాయి. నీకు తెలుసా చైనాలో పూర్వకాలంలో అమ్మాయిల పాదాలు పెరక్కుండా పాదాలను బిగించి కట్టేవారంట. చిన్న పాదాలు ఉన్న అమ్మాయిలకే వివాహాలు అయ్యేవంట. వాళ్ళు పడ్డ బాధ లాంటిదే ఈ బోన్సాయ్ మొక్కల బాధకూడా. అయినా మొక్కలు మాట్లాడవుగా! పచ్చదనాన్ని పత్రహరితాన్ని క్రోటన్స్ లో వెదుక్కునే మనలాంటి నాగరీకులకు వేప చెట్టు పెంచుకోవడం మోటే! పోన్లే రాజీ మనం కూడా ఓ వేప చెట్టు నాటుదాం" సరేనా అంటూ నాభాధను పోగొట్టడానికి మాట్లాడారు. అప్పుడే నాకుయింట్లో వేపచెట్టు ఉన్నంత ఆనందం "మరి ఇంటి ఓనర్స్" అనుమానంగా అడిగా? ..."పర్లేదు వాళ్ళని నేను ఒప్పిస్తాను..."

"అవునూ అమ్మా ఇంతకీ నువ్వు వేపచెట్టు కాదు కాదు వేప్పుల్ల కోసం ఎందుకు వెళ్ళావ్.." నా కొడుకు ప్రశ్న తన ప్రశ్న అన్నట్లు ఆయన నావైపు చూశారు. వాళ్ళ ప్రశ్నకు చిరునవ్వు నామోమంతా పరుచుకుంది. అవును పోగులు పెట్టుకుంటే ఆ రంధ్రాల్లో చీములాగా వచ్చింది. బాగా నెప్పి.. ఎన్నిరకాల ఆయింట్ మెంట్స్ వాడినా తగ్గలేదు. చిన్నప్పుడు అమ్మమ్మ "రాజీ వేప్పుల్లంత మేలు ఏమొక్కా చెయ్యదే.. దొడ్లోకి వెళ్ళి పండుపుల్ల ఏరుకురా..." అంటూ బండ మీద రుద్ది పోగులు తీసి పుల్లలు పెట్టింది. చేత్తో తీసేసినట్లు రెండు రోజుల్లో తగ్గిపోయింది. అందుకే నాయీ వేప్పుల్ల వెదుకులాట.. అమ్మా ఇంత చిన్న పుల్ల కోసం ఇంత దూరం తిరిగావని కాదు ఈ చెట్టు వల్ల ఉన్న ప్రయోజనాలు విన్న తరువాత దీన్ని పెంచే బాధ్యత నాది అంటూ వాగ్దానం చేశాడు నా కొడుకు.

భవిష్యత్ తరం తరతరాలుగా వస్తున్న వృక్ష సంపదను తప్పకుండా బ్రతికిస్తారన్న ఆశ నాలో వేప మొలకలేసింది.



# కొత్త వెలుగు

- అల్లూరి సుజాతా దేవి

నిర్మల ఆ రోజే కొత్తగా ఆఫీసులో టైపిస్టుగా అపాయింట్ అయ్యింది. ఇంక అంతే ఉదయం పదిగంటల నుంచి ఆ కొత్త నిర్మల గురించే మాట్లాడు కోవటం మొదలు పెట్టాం మేమందరం.

ఏవూరు, పెళ్ళయ్యిందా, పిల్లలు ఇలా రకరకాల ప్రశ్నలు వేయటం చేస్తున్నారు. అన్నింటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్తుందామె. నెమ్మదస్తురాలు కావటం, అందంగా వుండటంతో కొద్ది రోజులలోనే అందరినీ ఆకట్టుకుంది.

నిర్మలా, నిర్మలా అంటూ అందరికీ తలలో నాలుకలా మారింది. ఒక రోజు లక్ష్మణ్ అంటున్నాడు. "నిర్మలా మేడమ్ అందరినీ దోచేసుకుంది పెద్దదొంగ. అంటూ వుంటే అందరూ నవ్వేరు. అలా కాలం సాగిపోతోంది. కొన్ని రోజులకు లక్ష్మణ్ బాబాయ్ వూరు నుంచి వచ్చేడు.

నా దగ్గర లక్ష్మణ్ అంతకు ముందు రోజు నిర్మలను పెళ్ళి కోసం తీసుకోవాలనుకుంటున్నాని అందుకు నా అవసరం వుంటుందని నిర్మలను ఒప్పించమని కోరాడు.

నేను ఈ విషయం కదపాలా అని ఆలోచిస్తున్నాను. లక్ష్మణ్ బాబాయ్ అందరూ లంచ్ చేస్తుండగా వచ్చాడు. అప్పటి వరకూ లక్ష్మణ్‌తో మాట్లాడి వెళుతూ వెనక్కి తిరిగి నిర్మల దగ్గరకు వచ్చి "నీవు గణేశ్వర రావు కోడలు కదా అన్నాడు ఏదో గుర్తొచ్చి 'అవునండీ' అంది నిర్మల. సన్నగా గొంత పెగల్చుకుని, మాదీ "ఆ వూరేనమ్మా అన్నాడు మళ్ళీ అతనే" నీకో కొడుకు వుండాలి కదా" అనగానే

అవునండీ "వాడు చదువు కుంటున్నాడండీ" అంది.

మరి ఏమనుకోకమ్మా బాబుకి నీకు ఆ రోగం రాలేదా? అన్నాడు అమాయకంగా,

అప్పటికే స్టాఫ్ అందరూ చేరిపోయారు.

అన్నం తింటున్నవాళ్ళు ఇంకా తినని వాళ్ళు అందరూ చేరి రకరకాలుగా వూహించుకుని మాట్లాడటం మొదలు పెట్టారు.

అదృష్టవశాత్తూ కొందరికి రాదట అందులో రకాలుంటాయట అందుచేత బాబుకు నాకూ రాలేదు. అనగానే ఆఫీసు వాళ్ళందరూ అదో మాదిరిగా చూడటం కామెంట్ చేయటం మొదలు పెట్టారు. అంతా చూస్తున్న నా మనసు ఆర్థమైపోయింది.

ఛ పాపం భర్తకు ఎయిడ్స్ వుంటే ఆమె ఏం పాపం చేసింది. అంటూ చివాట్లు పెట్టానందరికీ లక్ష్మణ్ "మేడమ్ ఆ విషయం అడగలేదు కదా అన్నాడు. లేదులే ఆమెనర్థం చేసుకునే సంస్కారవంతుడెవరైనా దొరక్కపోడు అంటూ అందరినీ హెచ్చరించి ఫైల్సు చూడమన్నాను. ఆఫీసర్ హోదాలో వర్క్ చూడమని ఆర్డర్ జారీ చేశాను. ఎవరి పనులు వారు నిశ్శబ్దంగా చూసుకుంటున్నారు. తుఫాను మాదిరిగా మారిపోయింది నా మనసు పాపం ఆమె ఎంత బాధపడుతుందో అనుకుంటూ ఆలోచిస్తున్నాను. సాయం కాలం ఎలా అయ్యిందో ఆ దేవుడికే తెలియాలి. నిర్మలా అంటూ పిలిచాను.

ఏమిటి మేడమ్ అంటూ ఫైల్స్ సర్ది వచ్చింది. ఆమెను పరిశీలనగా



చూడటం మొదలు పెట్టాను. కందగడ్డలా మారిపోయింది ముఖం కళ్ళు ఉబ్బి వున్నాయి. నిర్మలా "రేపు మా బాబు పుట్టిన రోజు నీవు మా ఇంటికి రావాలి" అంటూ ఆహ్వానించాను.

"మేడమ్ నేను రాలేను" అనగానే "ఏం పనివుంది. అనడిగాను. మరి హెచ్.ఐ.వి సంబంధించి క్లాసులు పెడుతున్నారు. మేడమ్ వాటికి వెళ్ళి వచ్చేసరికి మధ్యాహ్నం రెండు గంటలవుతుంది.

నిర్మల అలా అనగానే రేపెలాగూ ఆదివారం. నీవు మా ఇంటికి వచ్చి తీరాలి. అబ్బాయి నీవు రావాలి తెల్సిందా అన్నాను. అలాగే వస్తాను మేడమ్ అన్నది నిర్మల మాటిస్తూ ఖచ్చితంగా.

... ... ...

మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకు నిర్మల కొడుకుని తీసుకుని వచ్చింది. చుట్టూ చూస్తూ ఎవరూ రాలేదేమిటి అన్నది ఆశ్చర్యంగా, పిలిస్తే కదా రావటానికి అంటూ మా పిల్లలను పిలిచేను. బాబు చాలా ముద్దుగా వున్నాడు. దగ్గరకు పిలిచి పేరడిగాను. ప్రదీప్ అన్నాడు. నేనడిగిన ప్రశ్నలకు చక్కగా సమాధానం ఇచ్చేడు. మర్యాదగా మాట్లాడటం నాకు బాగా నచ్చింది. మా అబ్బాయిలతో బాగా కలసి ఆడుకుంటున్నాడు.

నిర్మల నన్నే ఎందుకు పిలిచారు మేడమ్ అని అడిగింది. ఏం లేదు నిర్మలా నీ సమస్య విన్నాక నీ మీద ఇంకా గౌరవం పెరిగింది. అందరిలా నీ మీద నాకు అపోహలేదు. ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నావ్ అందుకే ఇంత దూరం వచ్చి ఉద్యోగం చేస్తున్నావ్ అవును మేడమ్ ఎయిడ్స్ గురించి అన్ని విషయాలు తెలుసుకుని మీటింగ్ పెట్టి ప్రజలను చైతన్య పరచాలి. స్వచ్ఛంద సంస్థల ద్వారా ప్రచారం చేసి ఇకముందు ఎవరికీ రాకుండానూ, వచ్చిన వాళ్ళు ధైర్యంగా బ్రతికేలాగునా అందరికీ ఉపయోగ పడాలను కుంటున్నాను."

"నా సహకారం ఎప్పుడూ వుంటుంది" అనగానే థ్యాంక్యూ మేడమ్ అన్నది.

"అమ్మా చీకటవుతోంది ఇంటి కెళ్ళదాం" అంటూ తల్లి దగ్గర కొచ్చాడు ప్రదీప్. మా పిల్లల ప్రదీప్‌ని వదలలేక పోయారు. ప్రతీ సండే ప్రదీప్ మాఇంటికి రావాలి. అన్నారు మా పిల్లలు అలాగే మీరూ మా ఇంటికి రావాలి. అంటూ పెద్ద ఆరిందాలా ఆహ్వానించేడు. "చాలా

సంతోషంగా గడిచింది మేడమ్ నా మనసు దూదిలా మారి పోయింది." అంటూ నిర్మల తెచ్చిన గిఫ్ట్ మా అబ్బాయికిచ్చింది. వదలలేక వదిలి వెళుతున్న ప్రదీప్‌ను నిర్మలను అలాగే చూస్తూ ఆలోచిస్తు నిలబ్డాను.

... ... ...

చాలా రోజులు గడిచాయి.

నిర్మల మీటింగ్‌లు పెట్టి ప్రజల్లో అపోహలను తొలగించటానికి ప్రయత్నిస్తోంది. సంఘంలో ధైర్యంగా బ్రతకటానికి ఎందరికో చేయూత నిస్తోంది. మొదట్లో జనం మీటింగ్‌లకు హాజరయ్యే వారుకాదు. సాటి ఆడవారు కూడా ఇలాంటిది ఎందుకమ్మా, బయటకు మాట్లాడితే ఏం బావుంటుంది. ఇలాంటి విషయాలు అంటూ మేం రామంటూ కొట్టి పారేసినా అలాగే ఓపిగ్గా మారుమూల పల్లెలకు సైతం వెళ్ళి ఎయిడ్స్ గురించి తెలియ చెప్పటం మొదలు పెట్టింది. తన కృషి పట్టుదలతో జనం బాగానే రావటం మొదలు పెట్టారు. ఇన్ని విషయాలున్నాయా మాకు తెలీదు అంటూ ఆశ్చర్యంగా అన్ని విషయాలు విని తెలుసుకోవటం మొదలు పెట్టారు. ఆ అమాయకపు ప్రజలు చైతన్య వంతులయ్యారు. తప్పు చేసేవారు దిద్దుకుంటున్నారు. తప్పని తెలుసుకుంటున్నారు.

హమ్మయ్య నా కృషి సఫలం అయ్యింది. నాలా ఎవరూ బాధ పడకూడదు. కొందరికయినా కష్టాలు తప్పుతాయి. ఓ రోజు ఆఫీసులో మేడమ్ అంటూ నా రూమ్‌లో కదుగు పెట్టిన లక్ష్మణ్‌ని ఆశ్చర్యంగా చూసేను. మేడమ్ మీరెంచేస్తారో నాకు తెలీదు. నిర్మలను తప్ప నేను ఇంకెవరిని పెళ్ళి చేసుకోను. అంటూ చిన్న పిల్లాడిలా మంకు పట్టుపట్టి కూర్చున్న లక్ష్మణ్‌ను నవ్వుతూ చూసి ఇలా అన్నాను. "ఆమెను పాత విషయాలు గుర్తు చేసి బాధ పెట్టవు కదా లేదు" "మేడమ్ అలాంటి భార్య రావటమే నా అదృష్టం. ఆమె గతం నా కనవసరం. ఆమె గురించి ఏ అనుమానం నాకిప్పుడు లేదు." అనగానే నిర్మలను పిలిచి విషయం చెప్పాను. కొంచెం ఆలోచించనీ మేడమ్ రేపు ఏమాట చెప్తాను. అనగానే ఆమె ముఖంలో నాకు సిగ్గు కన్పించింది.

రేపేం చెప్తుందో అని తెల్లవార్లూ నాకు నిద్రలేదు. అదే ఆలోచనతో ఎప్పుడు తెల్లవారిందో నాకే తెలీదు. "మంచి పనులు సమాజ సేవచేసే భార్య అందరికీ దొరుకుతుందా" లక్ష్మణ్ ఈ విషయంలో అదృష్ట వంతుడు కరుణ నిండిన నిర్మలను పెళ్ళాడటం ఎంత మంచి నిర్ణయం అంటూ అభినందించాను.

ఫోన్ రింగయ్యింది. శుభసూచకంగా హమ్మయ్య నిర్మల పెళ్ళికి అంగీకరించింది. ఒక జీవితంలో వెలుగు నిండింది. ఒక మోడు వారిన మొక్కకు ఆశల చిగుళ్ళు తొడిగాయి. జీవితంలో వసంతాలు పూస్తున్నాయి. అనుకుంటూ తేలిగ్గా నిట్టూర్చాను.

... ... ...

లక్ష్మణ్ నిర్మల కలసి ఎయిడ్స్ నిర్మూలనకు ఎన్నో కార్యక్రమాలు ఏర్పాటు చేసి సభల్లోను, ఇంటింటికీ వెళ్ళి ప్రతివారికీ అర్థమయ్యేలా చెప్పి వాళ్ళను విద్యావంతులుగా చేసి ఆదర్శ గ్రామాల్లా తీర్చి దిద్దుతున్నారు.

# బీడీ కార్మికుల ఉపాధిని పోగొట్టే "పుర్రె" హెచ్చరిక - జివో నెం. 297 రద్దుకై ఐక్యంగా ఉద్యమిద్దాం.

- ఎస్. రమాదేవి



బీడీ పరిశ్రమను దెబ్బతీసే జివో నెం. 297ను 2007 జూన్ 1వ తేదీ నుండి అమలు చేస్తామని కేంద్ర ఆరోగ్య శాఖమంత్రి అన్బుమణి రాందాసు ప్రకటించారు. కాంగ్రెస్ ప్రభుత్వం కరీంనగర్ ఉప ఎన్నికల సందర్భంగా బీడీ కార్మికుల ఉపాధిని, ప్రయోజనాలను కాపాడుతామని ఇచ్చిన హామీ నీటి మీద రాతలయ్యాయి.

నిన్నటిదాక బీడీ కార్మికుల సమస్యలపై ఉద్యమాలు జరిగాయి. ఆ సమస్యలను పరిష్కరించడంలో ప్రభుత్వాలు పట్టీపట్టనట్లుగా ఉన్నాయి. ఈ పరిస్థితి ఇలా ఉండగానే "మూలిగేనక్కపై తాటిపండు పడ్డట్లుగా" కేంద్ర ప్రభుత్వం జివో నెం. 297ను తీసుకువచ్చింది. 2006 జూలై కేంద్ర ఆరోగ్యశాఖ ఈ ఉత్తర్వులను వెలువరించింది. దీనితో బీడీ కార్మికుల బ్రతుకే ప్రశ్నార్థకంగా మారనున్నది.

ఈ జీవో అమలు కావడం వలన బీడీ కట్టలపై ఇంటూ గుర్తులో రెండు ఎముకలు, వాటి మధ్యలో పుర్రె-శవం బొమ్మ... పక్కన "పొగాకు నిన్ను చంపుతుంది" అన్న హెచ్చరిక. పొగాకు త్రాగడం వలన ప్రతిరోజు 2500 మంది భారతీయులను చంపుతుంది అనే రాతలు ఉంటాయి. బీడీలపై విధిగా వీటిని ముద్రించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. సిగరెట్ పెట్టెలపై ఉన్నట్లుగా చిన్నగా ఉంటే కుదరదు సుమా! ఇలా ముద్రించటం వలన శవం ఎముకల మధ్యన కంపెనీ పేరు చిన్న అక్షరాలతో అగుపిస్తుంది.


సదస్సులో పాల్గొన్న బీడీ కార్మికులు

<u>ప్రజల ఆరోగ్యమే ప్రభుత్వ లక్ష్యమట:-</u> 297 జివోను ఎందుకు తీసుకువస్తున్నారంటే ప్రజల ఆరోగ్యమే తమ లక్ష్యమని ప్రభుత్వం చెపుతుంది. "తాటిచెట్టు ఎందుకెక్కావంటే - దూడ గడ్డికోసమన్నట్లు"గా వుంది ప్రభుత్వ వాదన. ఢిల్లీ నుండి గల్లీదాక సందు సందుకు, గల్లి గల్లీకి గుడికీ బడికీ మధ్యలో సైతం బెల్ట్ షాపులు, మద్యం షాపులు విచ్చలవిడిగా అమ్మకాలు జరుగుతుంటే గుడ్లప్పగించి చూసే ప్రభుత్వానికి ప్రజల ఆరోగ్యంపై ప్రేమా?

<u>శీతల పానీయాలలో ఎముకల, పురుగుమందుల అవశేషాలు ఉన్నాయని నిర్ధారణ జరిగితే:</u> ఈ పానీయాలను సేవించడం మూలంగా ఆరోగ్యానికి హానికరమని నిర్ధారిస్తే దీనిపై నియంత్రణ ఎందుకు లేదు? నిజంగా ప్రజల ఆరోగ్యమే తమ లక్ష్యమైతే వీటిపై కూడా ఇలాంటి ప్రకటనలను ముద్రించవచ్చుకదా? బీడీ కార్మికుల ఉపాధికి ఎలాంటి ప్రత్యామ్నాయాన్ని కల్పించకుండా, ప్రభుత్వం తీసుకుంటున్న ఈ చర్యల వెనుక ప్రజల ప్రయోజనం కన్నా బహుళజాతి కంపెనీల లాభాలు మిన్నగా ఉంది.

మొన్నటికి మొన్న కరీంనగర్ ఉప ఎన్నికల సందర్భంగా పాలక పార్టీలన్నీ ఈ జీవో పాపం నీదంటే నీదని ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకున్నారు. టిఆర్ఎస్ రాష్ట్ర అధ్యక్షుడు కెసిఆర్ మాట్లాడుతూ "అందరం కలిసి ప్రధాని ఇంటిముందు పడుకుందాం" ప్రధానిని నిలదీద్దాం, కొంతమంది నేను మంత్రిగా ఉన్నప్పుడే ఈజీవో వచ్చిందని ప్రచారం చేస్తుంద్రు - కాల్పులు జరిగితే మొదటి గుండు నేనే తింటా" అని పదే పదే ప్రకటించాడు. కెసిఆర్ కంటే వైస్ఆర్ నాలుగాకులు ఎక్కువే చదివాడు'' ఎన్నికల నియమావళి అడ్డుగా ఉన్నందున ఏమీ చేయలేకపోతున్నాం. లక్షల మంది ఆధారపడిన బీడీ పరిశ్రమను నా బొందిలో ప్రాణం వున్నంతవరకు మూతపడనివ్వను. పుర్రె, ఎముకల శవం గుర్తులను బీడీ కట్టలపై ముద్రించడం పెద్ద తప్పిదం. ఇలాంటి పని చెయ్యకూడదు. చేస్తే బీడీ పరిశ్రమ దెబ్బతింటుంది. కార్మికులంతా రోడ్డున పడ్తారు. ఈ సమస్యను పరిష్కరించే సత్తా సమర్థత మాకుంది. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవడం తప్ప... మాట తప్పే వంశం కాదు మాది. ఇది నా హామీ. దీనికి నేను బాధ్యుడను" ఈ ఎన్నికలు పూర్తయ్యాక మీ సమస్యలు పరిష్కరిస్తాను. బీడీ పరిశ్రమను నిలబెడతాం" అని ఒకరికి మించి ఒకరు హామీల వరదలు పారించారు. బిజెపి, టిడిపిలు సరేసరి. హామీల కాలం గడిచిపోయింది. తిరిగి పుర్రెగుర్తు సమస్య పునరావృతమైంది. ఏలుతున్న పాలకులు ఇచ్చిన హామీలు గుర్తెరగాలి. లేకపోతే బీడీ కార్మికుల ఆగ్రహాలను చవిచూడకతప్పదు.

<u>బీడీ పరిశ్రమ ముఖ్యమైన ఉపాధి పరిశ్రమ:-</u> బీడీ, తంబాకు, కొబ్బరిపీచు, పొగాకు, ఖాదీ, చేనేత, మత్స్య పరిశ్రమ వంటి వాటిల్లో ఆనవాయితీగా మహిళలు మిగతావాటిలో కంటే ఎక్కువ మంది పనిచేస్తుంటారు. ప్రస్తుత ప్రభుత్వ విధానాలు ఈ పరిశ్రమలను చావు దెబ్బకొడ్తున్నాయి. భారతదేశంలో వ్యవసాయం, చేనేత రంగాల తర్వాత ఎక్కువమంది కార్మికులు పనిచేస్తున్న పరిశ్రమ బీడీ పరిశ్రమ. బీడీ పరిశ్రమ దేశంలో 14 రాష్ట్రాల్లో విస్తరించి వుంది. దేశంలో 60 లక్షల మంది కార్మికులు బీడీ పరిశ్రమలో పనిచేస్తున్నారు. బీడీలు చేయడానికి అవసరమైన తునికాకు తెంపే పనిలో మరో 50 లక్షల మంది కార్మికులు ఉన్నారు. బీడీలకు వినియోగించే పొగాకు (తంబాకు) ఉత్పత్తి మీద 40 లక్షల మంది రైతులు ఆధారపడి ఉన్నారు. బీడీ కార్మికులలో నూటికి 90 మందికి పైగా స్త్రీలు. వీరిలో ఎక్కువ భాగం గిరిజనులు, దళితులు వెనుకబడిన వర్గాల వారే. పొగాకు పండించే రైతాంగంలో మెజారిటీ పేద మధ్య తరగతి వర్గాలవారే. బీడీ పరిశ్రమ మీద ప్రత్యక్షంగా కోటీ 50 లక్షల మంది ఆధారపడుతుండగా బీడీలను మార్కెట్‌లో అమ్మటం మీద మరిన్ని లక్షల మంది ఆధారపడి జీవిస్తున్నారు.



మన రాష్ట్రంలో ఈ పరిశ్రమపై సుమారు 15 లక్షల మందికి పైగా ఉపాధి పొందుతున్నారు. ఈ పరిశ్రమ ప్రధానంగా తెలంగాణా జిల్లాల్లో కేంద్రీకరించబడి వుంది. కర్నూలు, చిత్తూరు, కడప, అనంతపురం, నెల్లూరు, గుంటూరు జిల్లాల్లో వేల సంఖ్యలో కార్మికులు ఉపాధి పొందగలుగుతున్నారు. ఈ రకంగా బీడీ పరిశ్రమ రాష్ట్రంలో ఒక పెద్ద ఉపాధి పరిశ్రమగా వుంది. దీనిని అంతర్జాతీయ కార్మికసంస్థ (ఐఎల్‌ఓ) కూడా గుర్తించింది. బీడీ కార్మికుల సంక్షేమం కోసం చేపట్టదగిన చర్యలపై ఐఎల్‌ఓ పలు అధ్యయనాలు కూడా చేసింది.

ఇంత ప్రాముఖ్యత కలిగిన ఈ పరిశ్రమ దెబ్బతింటే దీనిపై ఆధారపడిన లక్షలాది కార్మికుల బ్రతుకుదెరువు సంగతేంటని ఆలోచించక పోవడం ఈ ప్రభుత్వ కార్మిక వ్యతిరేక స్వభావాన్ని తెలియజేస్తుంది. ప్రభుత్వ విధానాల మూలంగా బీడి కార్మికులు ఆకలిచావులకు, ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. పొగ త్రాగిన వాళ్ళు క్యాన్సర్, క్షయ లాంటి జబ్బులతో దీర్ఘకాలంలో చనిపోతే... ఈ పరిశ్రమ కుప్పకూలితే లక్షలాది కార్మికులు బలిపశువులు అవుతారు. ప్రభుత్వ విధానాల ఫలితంగా రైతు, నేత కార్మికులు ఆత్మహత్యలు, ఆకలి చావులకు గురౌతున్నా ఈ ప్రభుత్వానికి జ్ఞానోదయం కావటం లేదు.

<u>అమలుకాని ప్రభుత్వ సంక్షేమ పథకాలు:-</u> బీడీ కార్మికులు అసంఘటిత రంగ కార్మికుల్లో భాగం, దేశంలో సంఘటిత ప్రభుత్వ ప్రైవేట్ రంగాలు 3 కోట్ల మందికి ఉపాధి కల్పిస్తుంటే ఇందులో సగం సంఖ్యకు ఒక్క బీడీ పరిశ్రమ 15 లక్షల మందికి ఉపాధి కల్పిస్తుంది. దేశంలో 370కి పైగా బీడీ పరిశ్రమలు ఉన్నాయి. యివేకాక వేలకొద్ది చిన్న పరిశ్రమలు ఉన్నాయి. ఒక్క నిజామాబాద్ జిల్లాలోనే చిన్నవి, పెద్దవి కలుపుకుని 80కి పైగా పరిశ్రమలు ఉన్న రీత్యా ప్రభుత్వం కొన్ని సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టింది. వాటి అమలు తీరులో మాత్రం "నత్తనడకను"మరపించేదిగా వుంది. కనీస వేతనాలు చట్టం, పి.ఎఫ్, బీడీ అండ్ సిగార్ వర్కర్స్ (కండీషన్స్ ఆఫ్ ఎంప్లాయిమెంట్) యాక్ట్ 1966, బీడీ వర్కర్స్ వెల్ఫేర్ ఫండ్ యాక్ట్ 1976 వంటి చట్టాలను కూడా తెచ్చారు. బీడీ కార్మికుల ఆరోగ్యం, వారి పిల్లల చదువు, గ్రూప్ ఇన్సూరెన్స్, గృహవసతి, గుర్తింపు కార్డులు వంటి అవసరాలను తీర్చటంలో కార్మికశాఖ "మీనమేషాలను" లెక్కిస్తుంది.

<u>ప్రభుత్వ వాదనలో చిత్తశుద్ధి లేదు:-</u> కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో వైద్య ఆరోగ్య రంగాలకు కేటాయింపులు పరిశీలిస్తే ఆరోగ్య రంగం అనారోగ్యంగా ఉన్నట్లు కనపడుతుంది. మన దేశంలో ఐదు సం॥రాలు నిండకముందే చనిపోయే పిల్లలు సంవత్సరానికి 25 లక్షల మంది వుంటారు. వీరిలో అత్యధికులు వ్యాధినిరోధక టీకాలు చేయించనందువల్ల చనిపోతున్నారు. భారతదేశంలో ప్రజల ఆరోగ్య సమస్యల్లో 80 శాతం పరిశుభ్రమైన నీరు లేమి కారణంగా వస్తున్నవి. ప్రాణాంతకమైన 37 వ్యాధుల్లో 21 వ్యాధులు నీటికారణంగానే వస్తున్నాయి. గర్భిణీ స్త్రీలలో 88 శాతం మంది రక్తహీనత వలన బాధపడుతున్నారు. ఆహారధాన్యాలను ఎలుకలకు ధారదత్తం చేసే బదులు చౌకధరలకు ప్రజలకు అందుబాటులో ఉంచితే పౌష్టికాహార లోపం వలన కలిగే మరణాలను నివారించవచ్చు. కానీ పాలకుల ఉద్దేశం ఫలితంగా బహుళజాతి కంపెనీల ఉత్పత్తులకు (సిగరెట్) వాటి లాభాలకు స్పీడ్ బ్రేకర్లను తొలగించడం వారి విధానం. అసలు విషయం ఇది కాగా... ప్రజల ఆరోగ్యం, సంక్షేమం, ఉపాధి అని చెప్పే మాటల్లో వాస్తవం లేదు.

<u>ఐక్యంగా పోరాడుదాం:-</u> లక్షలాది మంది ఉపాధిని దెబ్బతీసే జివో 297ను రద్దు చేసేంతరకు సంఘటిత ఐక్య ఉద్యమాలను నిర్మించాల్సిన ఆవశ్యకత ఉంది. 26.04.2007న రాష్ట్ర స్థాయిలో ఐక్య కార్యాచరణ కమిటీ ఏర్పడ్డది. భవిష్యత్ పోరాట కర్తవ్యాలను రూపొందించుకోవడంతో పాటు, అమలుకు అన్ని వర్గాల ప్రజల సహకారం కూడగట్టడం అవసరం.



# బతుకు ఛిద్రం... లేదు భద్రం...




అయిదేళ్ళ క్రితం ఏర్పాటైన స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం (ఐద్వా అనుబంధం) ఇంటి పనివారలు ఎదుర్కొంటున్న సమస్యలపై నిరంతరం పోరాడుతోంది. ఈ సంఘం ఆధ్వర్యంలో మే 3వ తేదీన రాష్ట్ర సదస్సు జరుపుకున్న సందర్భంగా వివిధ జిల్లాల నుండి వచ్చిన ప్రతినిధులు తమ తమ గోడును సభాముఖంగా విన్నవించుకున్నారు. ఇంటి పని వారల సమస్యలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి.

రాష్ట్రంలో లక్షల సంఖ్యలో ఉన్న ఈ కార్మికులు ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు ఇంటా బయటా ఎన్నో అవమానాలను, ఛీత్కారాలను ఎదుర్కొంటూ జీవనం సాగిస్తున్నారు. కరువుతో ఉన్న ఊళ్లో ఉపాధి లేక కరువు వచ్చి పట్టణాలకు వలసలొచ్చి రోజంతా కష్టపడినా వారికి లభించేది మిగిలిపోయిన అన్నం మెతుకులు, చాలీ చాలని జీతాలు. దాదాపుగా అందరి జీవితాల్లోను మద్యం వల్ల ఇల్లు గుల్లవుతున్న పరిస్థితే. వీరి మగవారు తాగుడుకు బానిసై పిల్లల గురించి పట్టించుకోకపోవడం వల్ల పిల్లల బాధ్యత పూర్తిగా వీరిపైనే ఉంటుంది.

అరకొరగా లభించిన తెల్ల రేషన్ కార్డుల వల్ల ఉపయోగం చాలా తక్కువ. రేషన్, కిరోసిన్ కూడా లభించని పరిస్థితే. పొయ్యి మీదికి ఉంటే పొయ్యి కిందికి లేక పిల్లలకు పట్టెడన్నం పెట్టలేని స్థితి.

ఇంట్లో పరిస్థితి ఇలా ఉంటే ఇళ్ళలో పనిచేసే సందర్భంలో ఏ వస్తువు కనిపించకపోయినా మొదటి అనుమానం వీరిపైనే పడుతుంది. కాస్త అందంగా ఉంటే చాలు ఆ ఇంట్లోని మగ చూపులన్నీ ఆమెపైనే. ఇన్ని బాధలు పడుతున్నా వీరి జీవితాలేమన్నా మెరుగునపడే అవకాశం మాత్రం కానరావటంలేదు. నాలుగైదు ఇండ్లలో పొద్దంతా పని చేసినా వచ్చే ఆదాయం మూడంకెలు దాటడం లేదు. ఇంటి కిరాయిలకు సగం జీతం డబ్బులు పోతే మిగిలినదాంతో ఎన్ని పూటలు? ఎంత మందికి మాత్రం కడుపు నింపగలదు?

5 ఇళ్ళలో పనిచేసినా వచ్చేది 1,000 రూపాయలు మాత్రమే. కిరాయి 400 పోను మిగిలిన దాంతో ఇద్దరు పిల్లలు, తాను బతకలేక సగం పస్తులతో ఉంటున్నామని గుంటూరు జిల్లా వినుకొండకు చెందిన రాణి అంటుంది.

"ఉదయం పాలప్యాకెట్లు, కూరగాయల తెచ్చే దగ్గర నుండి అన్ని పనులు చేయాలి. జీతం పెంచమని అడిగితే మాత్రం మాకు గవర్నమెంటు పెంచుతుందా? మీరు అడిగినపుడల్లా పెంచడానికి అని కసురుకుంటారు." "గవర్నమెంటు ఎప్పుడు? ఎంత పెంచుతుందో మాకు చెబుతారా?" అని నెల్లూరు జిల్లాకు చెందిన రమణమ్మ తన అనుభవాన్ని చెప్పుకుంది.



" నాకు ముగ్గురు కొడుకులు. ఎవరూ పట్టించుకోవటం లేదు. ఈ వయసులో కూడా 4 ఇళ్లలో పాచి పనులు చేస్తూ నా మనవరాలిని పోషించుకుంటున్నా" అన్నది 60సంవత్సరాల బుచ్చమ్మ.

రిక్షా బండి నడిపే భర్త తాగుడుకు బానిసై చనిపోయాడని, 30 ఏళ్ళుగా తన కష్టంతో నలుగురు పిల్లలను పెంచిపెద్ద చేస్తానని, ఇద్దరు ఆడపిల్లలకు పెండ్లిళ్ళు చేశానని, పాచిపనిచేసేటపుడు ఎక్స్ట్రా పని చెబుతారు. ఎక్స్ట్రా పైసలు ఇవ్వరు. జీతం పెంచమని అడిగితే పనిమానుకోమని అంటారు. ఎన్నేళ్ళు విశ్వాసంగా పనిచేసినా జీతం విషయానికొస్తే జాలి మాత్రం పడరు. అంటుంది ఆదిలాబాద్కు చెందిన హనీఫా.

"సద్ది డబ్బాలు (ఫ్రిజ్‌లు) వచ్చాయి. మాకు దక్కాల్సిన మిగిలిపోయిన అన్నం కూరలు ఆ ఫ్రిజ్‌ల్లోకి పోతున్నాయి. 2,3 రోజులు తరువాత ఖర్చు కాకపోతే మాకు ఇస్తారు. ఇంటికి వెళ్ళి తినే వేళకు అవి కూడా పాచిపోతాయి. పారేయవలసిందే. లేకుంటే మేము, మా పిల్లలు రోగాలపాలవుతాము" అని కృష్ణా జిల్లాకు చెందిన లీల అన్నారు.

కర్నూలు జిల్లాకు చెందిన రంగమ్మ మాటల్లో 'చిన్నపుడు పండుగలొస్తున్నాయంటే సంతోషంగా ఎదురుచూసేవాళ్ళం. కానీ ఇప్పుడు పండగలంటే భయం. ఒళ్ళు హూనం అవుతుంది. పిల్లలకు వండి పెట్టుకోలేని పరిస్థితి".

"రకరకాల సబ్బులు, సర్ఫ్‌ల వల్ల చేతులు పుండ్లు పడ్డాయని, పొద్దస్తమానం పనిచేయడం వల్ల నడుం నొప్పి, ఒళ్ళు నొప్పులతో బాధపడుతున్నామని, పనిచేయడం కష్టంగా ఉంది" అని అంటోంది హైదరాబద్‌కుచెందిన లక్ష్మి.

"నేను ఒక డాక్టర్ గారి ఇంట్లో ఆరేళ్ళుగా పనిచేస్తున్నాను. ఇల్లు తుడిచి, బాసండ్లు తోమి, బట్టలు ఉతుకుతాను. హాస్పటల్ బట్టలు కూడా ఇంటికి తెప్పించి నాతోనే ఉతికిస్తారు. ఇంత పనిచేస్తే నాకిచ్చేది 350రూపాయులు. ఆ మధ్య చికున్‌గున్యా జ్వరం వచ్చి 3 రోజలు ఇంట్లోనే లేవలేక పడుకుంటే కంపౌండర్ చేత ఇంటికి పిలిపించి ఇంజక్షన్, మందులు ఇచ్చారు. దయగల మనుషులు అనుకున్నాను. కానీ జీతం ఇవ్వబోయేటపుడు తెలిసింది వారి విశాలమైన మనసు. మందులకు డబ్బులు కోసుకుని ఇచ్చారు. ఇదేందమ్మా? అని అడిగితే మాకు మాత్రం ఊరకే వస్తాయా? మందులు" అని చెప్పారు. అంటూ ఆవేదనను తెలియజేసింది విజయ.

ఎవరిని కదిలించినా కనిపిస్తుంది వారి గుండెల్లోని బాధ. ఇన్ని అవమానాలు భరిస్తూనే మన ఇల్లు శుభ్రం చేస్తూ, మన గిన్నెలు, బట్టలు మెరిసేలా చేస్తున్నా వారి బతుకుల్లో మాత్రం వెలుగురాదు. వీరిని కూడా కార్మికులుగా గుర్తించి కనీస వేతన చట్టం వర్తింప చేయాలని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం హర్షణీయం.

**స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం రూపొందించిన డిమాండ్లు:**

1. ఇంటి పనివారలకు ప్రభుత్వమే గుర్తింపు కార్డులివ్వాలి.
2. వీరిపై వేధింపులు, అవమానాలు అరికట్టాలి.
3. అదనపు పనికి అదనపు వేతనం ఇవ్వాలి.
4. ఇళ్ళ స్థలాలు, తెల్ల రేషన్ కార్డులు ఇవ్వాలి.
5. ఇఎస్ఐ, పి.ఎఫ్. సౌకర్యం కల్పించాలి.
6. ప్రభుత్వ సంక్షేమ పథకాలన్నింటిలో ఇంటి పనివారలకు ప్రాధాన్యతనివ్వాలి.
7. పట్టణ ప్రాంతాల్లో రేషన్ కార్డుపై 18 లీటర్ల కిరోసిన్ ఇవ్వాలి.

పై డిమాండ్ల సాధనకు ఇంటి పనివారలంతా ఐక్యమై ఉద్యమించాలి. హక్కులను సాధించుకోవాలి.

**- యన్.ఎస్. లక్ష్మిదేవమ్మ**



## మైక్రోఫైనాన్స్ బిల్లు సమగ్ర చర్చ తర్వాతే

పార్లమెంట్ ముందుకు రాబోతున్న మైక్రోఫైనాన్స్ బిల్లును మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు, మేధావులతో సమగ్రంగా చర్చించిన అనంతరం తిరిగి రూపొందించాలని ఆయా సంఘాల ప్రతినిధులు ఆర్థిక మంత్రి చిదంబరంకు సమర్పించిన వినతిపత్రంలో విజ్ఞప్తి చేశారు. ఇందుకు ముందు నాబార్డ్ బిల్లుగా పేరొందిన ఈ మైక్రోఫైనాన్స్ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టకుండా నిలిపి వేయాలని ఈ సంఘాలు కోరాయి. మైక్రోఫైనాన్స్ బిల్లు ప్రస్తుత రూపంలో ప్రాథమిక స్థాయిలోనే అనేక లోపాలున్నాయని వీరు ఎత్తి చూపారు. మహిళా స్వయం సహాయకశక్తి గ్రూపులతో కూడిన మైక్రోఫైనాన్స్ సంస్థలు, నాన్ బ్యాంకింగ్ ఆర్థిక సంస్థలు, లాభార్జనలేని మరో 25 సంస్థలను చట్ట నిబంధనల పరిధి నుండి మినహాయించటం ఆమోదయోగ్యం కాదని పేర్కొన్నారు. ఈ మినహాయింపు ద్వారా పేదల కష్టార్జితాన్ని ఈ సంస్థలు కార్పొరేట్ సంస్థల చేతుల్లో పెడతాయని, మైక్రోఫైనాన్స్ సంస్థలు వసూలు చేస్తున్న అత్యధిక వడ్డీ రేట్ల సమస్యను ఈ బిల్లు వదిలివేసిందని తెలిపారు. వడ్డీ రేట్ల నిర్ణయం మార్కెట్ శక్తుల దయాదాక్షిణ్యాలకే బిల్లు వదిలివేసిందని, ఇది మహిళల ప్రయోజనాలకు పూర్తిగా వ్యతిరేకమైనదని తెలిపారు. అంతే కాక మైక్రోఫైనాన్స్ సంస్థలకు, మహిళా సంఘాలకు నియంత్రణా వ్యవస్థలో ఎటువంటి ప్రాతినిధ్యం కల్పించకుండా నాబార్డ్‌నే స్వతంత్ర నియంత్రణా వ్యవస్థగా ఈ బిల్లు ప్రతిపాదిస్తోందన్నారు. ఆయా సంఘాలు, సంస్థలకు నియంత్రణా వ్యవస్థలో ప్రాతినిధ్యం కల్పించాల్సిన అవసరం వుందని, దీనిపై సమగ్రంగా చర్చించిన అనంతరం ప్రజాస్వామిక పద్ధతిలో స్వతంత్ర నియంత్రణా వ్యవస్థను ఏర్పాటు చేయాలని సూచించాయి.



# సంధియుగంలో స్త్రీ

- మల్లాది సుబ్బమ్మ

మనమిప్పుడు 20వ శతాబ్దంలో జీవిస్తున్నాం. స్వాతంత్ర్యానంతరం 54వ సంవత్సరంలో అడుగు పెట్టాం. రాజ్యాంగ లిఖితానంతరం 50వ సంవత్సరంలో పయనిస్తున్నాం. 1975లో మహిళా సంవత్సరాన్ని, తిరిగి 1985 మరకు మహిళా దశాబ్దాన్ని నిర్ధేశించుకున్నాం. మహిళా చట్టాలలో మార్పులెన్నో తెచ్చుకున్నాం. సవరణలెన్నో జరిగాయి. జాతీయ మహిళా కమీషన్ స్థాపన జరిగింది. స్త్రీ విద్యా ఉద్యోగాల స్థాయి పెరిగింది. నేటి మహిళాలోకం నాలుగు గోడలు దాటి బైటికొచ్చి ఆటల్లో... పాటల్లో సంగీత సాహిత్యాల్లో... చిత్రలేఖనాల్లో ముందు ముందు కొస్తున్నది. ఎంట్రెన్సు పరీక్షల్లో ఈనాటి అమ్మాయిలు ఫస్టు ర్యాంకులు సంపాదిస్తున్నారు. అంతరిక్షయానందాకా అధిగమించారు. దేశదేశాల్లో రీసెర్చి స్కాలర్లుగా వుంటున్నారు. ఈనాటి మహిళాలోకం శరపరంపరగా సర్వరంగాలలో పయనించటం, పోటీలు పడటం, ఉత్సాహం చూపటం మనం కళ్లారా చూస్తున్నాం. ఆలోచిస్తే ఇదంతా అభ్యుదయపథానికొక ఆశాకిరణం అని చెప్పక తప్పదు.

క్షణక్షణానికి నూతన రీతుల్లో సైన్సు పెరిగి అది విశ్వకవాటాలను ఛేదిస్తోంది. తద్వారా నాగరికత పెరిగింది. గ్యాసు స్టౌలు వచ్చాయి. కుక్కర్లు, గ్రెండర్లు, వాషింగ్ మెషీన్సు అందుబాటులోకి వచ్చి శ్రమను తగ్గిస్తున్నాయి. పని టైము తగ్గి విశ్రాంతి పెరిగింది. సైన్సు అభివృద్ధి వల్ల, నూతన పరికరాల రాకవల్ల స్త్రీకి సుఖశాంతులు పెరిగాయి. ఈ క్రొత్త పరిణామం వల్ల పూర్వమెన్నడూ అనుభవించలేని రీతిలో, నూతన విధానంలో ఈనాటి స్త్రీ ముందడుగు వేస్తోంది. అంతేకాదు ఇది విలువల విప్లవమా అన్నట్లు నేటి స్త్రీలు తమ హక్కులకైన అర్రులు చాస్తున్నారు. అధికారం కావాలని ఉద్యమాలు నిర్వహిస్తున్నారు. స్వేచ్ఛా, సమానత్వం మా జన్మహక్కుని చాటుతున్నారు. అధికారం కావాలని ఉద్యమాలు నిర్వహిస్తున్నారు. వృత్తి విద్యలకై ఎగబడుతున్నారు. గర్భస్రావాలు మా శారీరక హక్కుని వాదిస్తున్నారు. మేమెందుకు సెకండు బెంచీలో కూర్చోవాలి. మేమెందుకు రెండవ తరగతి పౌరులుగా మిగిలిపోవాలి. మా బిడ్డలకు గార్డియన్సుగా మేమెందుకు పనికిరాము అని పేచీలు, అభ్యంతరాలు అత్యధిక స్థాయిలో దర్శనమిస్తున్నాయి. పోరాటాలు జరుగుతున్నాయి. పరిణామంలో ఇదొక దశ అని అభివర్ణించడం అవివేకం కాదు.

ఇటీవలి కాలంలో విడాకుల రేటు పెరుగుతోంది. విధవా వివాహాలు మెరుగువుతున్నాయి. బాల్య వివాహాలు తగ్గుతున్నాయి. వరకట్న హింసలపై దర్యాప్తులు పెరుగుతున్నాయి. వరకట్న నివారణ ఉద్యమాలు ఉద్భవిస్తున్నాయి. ఇదంతా చూస్తుంటే, వింటుంటే అబ్బో! ఈ దేశంలో స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలు మూడు పువ్వులూ ఆరు కాయలుగా విలసిల్లుతున్నాయనే అభినందనలు మిన్నుముడుతున్నాయి. ఈ మార్పు కాని, మహిళాభ్యుదయం పోకడకాని, కారణమేదైనా కాని ఈ అభివృద్ధి కేవలం 5 శాతం మాత్రమే అనేది పచ్చినిజం. భారత స్త్రీని తరతరాలుగా పవిత్రమూర్తిగా ఆరాధిస్తున్నామని, మాతృమూర్తిగా గౌరవిస్తున్నామని, గృహిణిగా ప్రత్యేక స్థానం యిస్తున్నామని, దేవతగా పూజిస్తున్నామనే వాదన ప్రబలంగా వుంది.



మాతాపితలుగా, సీతరాములుగా, పార్వతీపరమేశ్వరులుగా స్త్రీని ముందుగా పేర్కొంటున్నామని అది ఆమె పవిత్రతకు చిహ్నమని, పురుషుల ఉదారతకు నిరూపణ అని వేదకాలం నుండి గార్గి, మైత్రేయి లాంటి విదుషీమణులుండేవారని ఈ దేశంలో స్త్రీకి ఇచ్చిన స్థాయి, స్థానము, హోదా మరేదేశంలోనూ లేదని హోరాహోరీగా వాదిస్తున్నారు. అలా భ్రమపడేవారు 90 శాతందాకా వున్నారు. అలాంటి భావాలుకల స్త్రీలు కూడా మిక్కుటంగానే వున్నారు. అలా అభివర్ణించబడుతున్న స్త్రీ పురుష సంబంధం లేక సహజీవనం సాఫీగా, ఆనందప్రదంగా కొనసాగుతోందా? భర్త భరించేవాడుగా, భార్య పోషింపబడేదిగా వుంటోందా? లేదా? అనేది ఒక ప్రశ్న అయితే స్త్రీ కేవలం గృహిణిగా, పిల్లల తల్లిగా మాత్రమే తన జీవితాన్ని నిర్వహిస్తోందా? అసలు కుటుంబపరంగా స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయా? వుంటే అవి ఏ రూపాల్లో దర్శనమిస్తున్నాయి. వాటినెలా సంస్కరించాలి అనేవి ఈనాటి ముఖ్యాంశాలు. కనుక లాజికల్‌గా చర్చించక తప్పదు.

ఒక వంక స్త్రీ జనాభ్యుదయం వున్నదంటున్నాం. మరొకవంక అనాదిగా స్త్రీ ఆరాధ్య దేవత అని వింటున్నాం. వేరొకవైపు స్త్రీలు అణగద్రొక్కబుడుతున్నారని, వారిపై అత్యాచారాలు జరుగుతున్నాయని గగ్గోలు పెడుతున్నాం. ఇందులో ఏది సత్యం, ఏది అసత్యం? ఏ మార్గాన పయనించాలి? ఈనాటి స్త్రీల పరిస్థితి ఏమిటి? పురోగమనమా లేక తిరోగమనమా అనేది మరో ప్రశ్న. అసలు ఈనాటి స్త్రీల సమస్యలేమిటి? అసలు సమస్యలు, లోపాలు, బాధలు వుంటేనేకదా నివారణ మార్గాలు అనే మీమాంస ఒకటి మన ముందుకొచ్చింది. ఒకవిధంగా ఆలోచిస్తే ఇది పాత కొత్తల కలయిక కనుక దీన్ని సంధియుగంగా పేర్కొనవచ్చు. అంటే సంపూర్ణ స్వేచ్ఛా సమానత్వాలు రాలేదు. అసలు అభివృద్ధి లేకపోలేదు.

నేటి స్త్రీకి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సమస్యలు వర్ణనాతీతంగా వున్నాయనే దానికి తార్కాణాలు అనంతంగా వున్నాయి. మతపరమైన ఆంక్షలు, అభ్యంతరాలు, వివిధ నిషేధాలు అత్యధికంగా వున్నాయి. అవన్నీ వివరిస్తే అదీ ఒక ఉద్గ్రంథమవుతుంది. కనుక అన్ని రంగాలకు మూలమైన కుటుంబాన్ని ఒక యునిట్‌గా తీసుకొని కుటుంబ సమస్యలకు పరిమితం చేసి పరిశీలించటం సమంజసం. స్త్రీ పురుష లిద్దరూ కలిసి సహజీవనం చేసేది కుటుంబంలోనే కనుక కుటుంబం జీవితం అందరికీ అనుభవైక వేద్యం. అందువల్ల స్త్రీ జీవిత వివరణా నిరూపణ కుటుంబ పరిధిలో చెప్పడం సుకరమవుతుంది.

అమ్మాయి పుట్టుక కుటుంబంలోనే కాదు. ముందుగా ఆమె పుట్టక గురించి వింటే కొంత అవగతమవుతుంది. అమ్మాయి పుట్టిందనగానే తల్లడిల్లిపోతారు. కన్నవారు. అందుకే గర్భస్థ పిండంగానే హతమార్చే ప్రక్రియ వచ్చింది. ఆరువారాలకే పిండం ఆడదని తెలిసి గర్భస్రావం చేయించుకుంటున్నారు. అలా పోగా బ్రతికిబైటపడ్డ పిల్లకు ఏ వేడుకలూ లేక ఎలాగోలా బ్రతకనిస్తారు. ఎంత మొద్దబాయి అయినా అప్పుచేసి అయినా చివరకి సూత్రాన్ని అమ్మి అయినా చదువు నేర్పిస్తాం. అదే అమ్మాయి అయితే ఎంత చదివినా ఇంకా పై చదువు వాడు భర్తగా రావాలిగదా! అది అతికష్టమని చదువు మాన్పించి, ఎంతో అంతమూట (కట్నం) ఇచ్చి పెళ్లి చేస్తారు. ఏ లక్షకో తప్ప పై చదువులు చదివే అమ్మాయిలే మామూలుగా కన్పించరు.

స్త్రీకి పెళ్లి కాకముందు కొన్ని సమస్యలు అనంతం అనక తప్పదు. అతడెంతటి దుర్మార్గుడయినా ఆమె పూర్వజన్మ సుకృతం అంటూ ఘోషిస్తారే తప్ప అది అతని దుర్మార్గ ప్రవృత్తి అనరు. ఇక సంతానం కలుగకపోతే అదంతా ఆమె లోపమేనని సూత్రీకరించి, గొడ్రాలని చిత్రీకరించి మరలా పెళ్లాడతారు. అతని శారీరక లోపమైనా దోషం ఆమెదే అవుతుంది. ఇక ఇచ్చిన కట్నం చాలదని, తెచ్చిన లాంఛనాలు పేలవంగా వున్నాయంటూ నానా హింసలూ పెట్టడం, చంపటం లేదా ఆత్మహత్యకు పాల్పడటం వంటి చర్యలు జరుగుతున్నాయి. ఈ ఘాతుకాన్నీ రోజూ చూస్తున్నాం, వింటున్నాం, చదువుతున్నాం. ఇక కొట్టేవారు, తిట్టేవారు, వెళ్లగొట్టేవారు, చిత్రహింసలపాలు చేసేవారు. కిరసనాయిలుపోసి కాల్చేవారు హెచ్చుస్థాయిలోనే వుంటున్నారు. ఈ దశ్చర్యలకు మా శరణాలయాలకు వచ్చి చెప్పుకునేవారి సంఖ్య ఈ ఆధునిక యుగంలో కూడా మిక్కుటంగానే వుంటోంది. దారితెన్నూ లేనివారు, బాధలను భరించలేనివారు గమ్యం లేక హోమ్‌లో తలదాచుకుంటున్నారు. అంటే సర్వలక్షణోపేతులైన స్త్రీలను కేవలం జంతువుల్ని బోనులో వుంచినట్లు వారికి ఆశ్రయం ఇవ్వడం ఎంత అనాగరిక దశో ఆలోచిస్తే అర్థమవుతుంది. కొందరు భర్తలయితే పరమ శాడిస్టులుగా వుంటారు. త్రాగిన బాటిల్సుతోనే కొడుతున్నారు. సిగరెట్లతో కాల్చేవారున్నారు. పిల్లల్ని లాక్కుని వెళ్లగొడుతుంటే ఆడవారు పడే ఆక్రందనలు హృదయ విదారకంగా వుంటున్నాయి.

ఇంక సంపాదించే ఉద్యోగినులు కొందరున్నారు. వారికి సంపూర్ణ స్వేచ్ఛ వుంటుందని, తమకు లేదని బాధపడే గృహిణులకు తెలియని అనుభూతి ఒకటి వుంది. గృహిణులు కేవలం భర్తలపై ఆధారపడి జీవించే 'పేరాసైటు' అని పిలువబడుతున్నారు. వారు ఇంటిచాకిరి ఎంతచేసినా వారివల్ల ఆదాయం శూన్యమని, వారిని నిరసనగా చూస్తూ వుంటారు. మరి సంపాదించేవారికి కూడా సంపూర్ణ స్వేచ్ఛ లేదంటే నమ్మండి. సంపాదించినదంతా లెక్క చెప్పాలి. కొందరు భర్తలయితే ఇద్దరి ఆదాయం కలిపి తమ పేర ఇల్లో ఏ వ్యాపారమో సాగిస్తాం. సంపాదన ఆమె వ్యక్తిగత వికాసానికి, స్వేచ్ఛా జీవితానికి కాదట. వేడినీళ్లకు చన్నీళ్లు తోడైనట్లు అంటారు. ఎంతమందిని కనాలో నిర్ణయించేది భర్త. ఏ విధానంలో పిల్లల్ని పెంచాలో, ఎవరితో ఎలా ప్రవర్తించాలో శాసించేది పురుషుడే. ఇష్టం వచ్చివాడిని పెళ్లాడాలన్నా, ఇష్టం వచ్చిన ఉద్యోగం చెయ్యాలన్నా, ఇష్టమున్నచోట నివసించాలన్నా అన్నీ ఆయన అదుపు ఆజ్ఞలలో పరిభ్రమిస్తూ వుంటాయి. అంతేకాదు ఉద్యోగరీత్యా బదిలీ అయిన భార్యల ఉద్యోగాలు మాన్పించిన భర్తలున్న రాజ్యం మనది. కాకపోతే చీరెలు, నగలు, పూజ, సినిమాలు, టి.విలు కొనిపెడితే తన్ను గౌరవిస్తుందని అమరుస్తాడు. అంటే ఎంత బాగా పోషిస్తే అంత అనుకూలంగా వుంటుందని మనువే చెప్పాడు. అనుకూలవతిగా వుండే రీతిలో భార్యలను కంట్రోలు చెయ్యాలని హెచ్చరించాడు మనువు. తనకు అనుకూలమైన సలహాలు ఇచ్చేవాటిని మాత్రమే (ఇల్లు, పిల్లల చదువు లాంటివి) ఆమెతో సంప్రదిస్తారు. ఆహ నన్ను నా భర్త అడిగాడుగదా అని ఆమె మురిసిపోతుంది. ఉద్యోగరీత్యా వేరేవూరువెళ్లి వుంటానంటే హర్షించే భర్తలందరో! అన్ని ఆలోచనలూ అతని పరిధిలోనే పరిభ్రమిస్తూ వుంటాయి. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హత అనేది బిసి నాటి ఆదర్శమయినా, తరతరాల భావదాస్యమే అయినా ఆ సిద్ధాంత పటిమ బలవత్తరంగా ఇంకా మన మస్తిష్కాలలో ప్రబలంగా నిలిచిపోయింది. అందువల్లే ఈనాడు మనకెన్నో హక్కులున్నా అనుభవించలేని అశక్తత మనను వెన్నాడుతోంది. రాజకీయ హక్కులు, చట్టపరమైన హక్కులు, ఆడపిల్లలకు ఆస్తిహక్కు, విడాకులు, విడోమ్యారేజీ, దత్తత లాంటివెన్ని వున్నా అవన్నీ ఆచరణశూన్యమై, మృగ్యమయిపోతున్నాయి. ఇది తరతరాల భావదాస్యం. 1956లో స్త్రీ పురుషులిద్దరికీ సర్వహక్కులూ సమానంగా కల హిందూకోడ్ బిల్లును అడ్డగించినవారిలో ఆడవారు కూడా వున్నారనేది గమనార్హం.

అక్కడక్కడా కొందరు స్త్రీలు ముందుకొస్తున్నారంటే, ఆందోళనలు నిర్వహిస్తున్నారంటే, హక్కులు అనుభవిస్తున్నారంటే, రాజకీయాల్లోకి పోతున్నారంటే అదంతా అత్యల్పం అని గమనించాలి. పురుషులందరూ దుర్మార్గులని చిత్రించడం లేదు. కాని ఇది పురుషస్వామ్యమని మనందరికీ తెలుసు. కాదని వాదించేవారు ఈనాడు లేరని చెప్పవచ్చు. కాని కుడి ఎడమ తేడాలవలెనే స్త్రీ పురుష తేడాలను ప్రకృతే సృష్టించిందని, పని విభజన శ్రేయస్కరమని కప్పదాటు వేస్తున్నారు. అలావుంటేనే సాఫీగా జీవయాత్ర సాగిపోతుందనే వితండవాదం ప్రబలంగా వుంది. ఇంతకాలం వేల సంవత్సరాలుగా అనుభవిస్తున్న దాష్టీకం, యాజమాన్యం పురుషులు అంత తేలిగ్గా వదిలివేయగలరా అనేది ఒక ప్రశ్న. ఈనాడు స్త్రీలు చెయ్యలేని పనిలేదు అని నిరూపిస్తున్నా అది అర్థంకానట్లు నటిస్తాం. అంతేకాదు ఇంకా పురుషులు చేయలేని పునఃసృష్టిని స్త్రీలు మాత్రమే చెయ్యగల్గుతున్నా ఆడవారికి వ్యాధినిరోధక శక్తి 10 శాతం ఎక్కువని సైన్సు నిరూపించినా, ఎంత చేస్తున్నా, ఎంత ఎదిగినా, ఎన్ని సంస్కరణలు వచ్చినా ఆడది ఆడదే అనే నానుడి ప్రబలంగా వుంది. ఇది సహించరాని వ్యథ, బాధాకరం కూడాను. ఈ ప్రతిబంధకాలను ఈతరం స్త్రీలు సహించలేకపోతున్నారు. ఇదొక ప్రపంచ సమస్యగా తయారయింది. కొంత మంది స్త్రీలు కలిసికట్టుగా ఉద్యమాలు, పోరాటాలు సాగిస్తున్నారు. సభలు, సమావేశాలు, సెమినార్లు నిర్వహిస్తున్నారు. పత్రికలు స్థాపిస్తున్నారు. ఫెమినిస్టు ఉద్యమాలు ఉద్భవించాయి. రాడికల్ ఫెమినిజం, సోషలిస్టు ఫెమినిజం, కల్చరల్ ఫెమినిజం అనే పేర్లతో విభిన్న మార్గాల్లో పురుషస్వామ్యాన్ని ఛేదిస్తున్నారు. అయినా పితృస్వామ్య వ్యవస్థ పట్టుసడలటం లేదు. ఇదొక దీర్ఘకాలిక పోరాటంగా తయారయింది. కుల, మత, వర్ణ వర్గ, విభేదాలు విడనాడి ప్రపంచ స్త్రీలంతా ఏకమై పోరాడితే తప్ప ఈ సమస్య పరిష్కరించబడదని తేలిపోయింది.



# ఉద్యమ బాటలో

## ప్రజా ఉద్యమాలు విజయవంతం కావాలి

**మోటూరు ఉదయం ట్రస్టు భవనానికి శంకుస్థాపన:-** ప్రజల అభ్యున్నతి కోసం చేపట్టే ఉద్యమాలన్నీ విజయవంతం కావాలని రాష్ట్ర హోం మంత్రి కుందూరు జానారెడ్డి ఆకాంక్షించారు. హైదరాబాద్‌లోని బాగ్‌లింగంపల్లిలో నిర్మించనున్న మోటూరు ఉదయం ట్రస్టు భవనానికి ఆయన శంకుస్థాపన చేశారు. మోటూరు ఉదయం ఐదవ వర్ధంతి



సందర్భంగా జరిగిన సభలో జానారెడ్డి మాట్లాడుతూ సిద్ధాంతాలు, పార్టీలు వేరైనప్పటికీ ప్రజాసంఘాల అంతిమ లక్ష్యం ప్రజల అభ్యుదయమేనని ప్రజా సమస్యలపై చారిత్రక ఉద్యమాలు నడిపిన మహనీయులను స్ఫూర్తిగా తీసుకుని ఉద్యమాలు చేపట్టడం హర్షించదగిన విషయమని చెప్పారు. మహిళా సమస్యల పరిష్కారం కోసం అనేక కష్టనష్టాలకు ఓర్చి మహిళా సంఘం నేతలు చేస్తున్న కృషి అభినందనీయమని కొనియాడారు. ఇటు ప్రభుత్వం, అటు ప్రజా ఉద్యమకారులు పరస్పర సహకారంతో ప్రజల కోసం పని చేయాల్సిన అవసరం ఉందని, మహిళా సంఘం చేపట్టే ఉద్యమాలన్నింటికీ ప్రభుత్వపరంగా, వ్యక్తిగతంగా సంపూర్ణ మద్దతు ఇస్తామని ప్రకటించారు. మహిళలపై జరుగుతున్న అఘాయిత్యాలు, హింసను సమూలంగా నిర్మూలించేందుకు మోటూరు ఉదయం ఇచ్చిన స్ఫూర్తితో ఉద్యమించాలని , తద్వారా ఆంధ్ర రాష్ట్ర మహిళలు దేశానికే ఆదర్శంగా నిలవాలని కోరారు. సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ తెలంగాణా సాయుధ పోరాట యోధురాలు, మోటూరు ఉదయం ట్రస్టు ఛైర్మన్ మల్లు స్వరాజ్యం మాట్లాడుతూ మహిళాభ్యున్నతి కోసం ఉదయం చేసిన కృషి చిరస్థాయిగా నిలుస్తుందన్నారు. అడిగిన వెంటనే ట్రస్టు భవనం కోసం ప్రభుత్వం స్థలం కేటాయించినందుకు హర్షం తెలిపారు. సభకు హాజరైన కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు ఛైర్‌పర్సన్ కారుమంచి రమాదేవి మాట్లాడుతూ దేశంలో మహిళా సమస్యల పరిష్కారం కోసం జరుగుతున్న ఉద్యమాల్లో అన్ని సంఘాల కంటే అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం సభ్యులే ముందువరుసలో ఉంటున్నారని , ఐద్వా నుంచి తాము ఎంతో నేర్చుకోవాల్సిన అవసరం ఉందని గుర్తించినట్లు చెప్పారు. మోటూరు ఉదయం స్ఫూర్తిని నేటి మహిళలందరిలో నింపాలని కోరారు. మహిళలందరూ సంఘటితమై పోరాడితే చట్టసభల్లో 33 శాతం రిజర్వేషన్లు సాధించడం పెద్ద సమస్య కాదన్నారు. కష్టాల్లో ఉన్న మహిళలకు ట్రస్టు అండగా నిలవాలని ఆకాంక్షించారు. కార్యక్రమంలో పాల్గొన్న అభ్యుదయ సినీనటుడు మాదాల రంగారావు మాట్లాడుతూ తనకు మోటూరు ఉదయంతో 40 ఏళ్ల అనుబంధం ఉందన్నారు. ఆమె ఏ పదవులూ అలంకరించక పోయినా ఉద్యమాల ద్వారా శాశ్వతంగా మహిళల హృదయాల్లో నిలిచారని చెప్పారు. 40 ఏళ్ల క్రితం ఆమె విజయవాడలో సైకిల్ తొక్కుతూ మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పనిచేశారని గుర్తు చేశారు. సైకిల్‌పై వెళ్తుంటే ఆకతాయిలు అల్లరి చేస్తే వారిని ధీటుగా ఎదుర్కొన్న ధైర్యశాలి అని కొనియాడారు. పరుచూరి హనుమంతరావు మాట్లాడుతూ ఉదయం చేపట్టిన మహిళా ఉద్యమాలను వివరించారు. ఈ కార్యక్రమానికి మోటూరు ఉదయం పెద్ద కుమార్తె మోటూరు టాన్యా, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి స్వరూపరాణి, నాయకురాలు జ్యోతి, ట్రస్టు సభ్యులు పుతుంబాక భారతి, వివిధ జిల్లాల మహిళా సంఘం నేతలు హాజరయ్యారు. ఈ సందర్భంగా మోటూరు ఉదయం ట్రస్టుకు ఉద్దరాజు సత్యవతి (ప॥ గోదావరి) 10 వేలు, డాక్టర్ క్రాంతి కుమారి (కొత్తగూడెం) 1000, లలితాజోషి (హైదరాబాద్) 500 రూపాయలు విరాళం అందజేశారు.

### అంతర్జాతీయ మహిళా దినోత్సవం:

మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని "ఐద్వా-సిఐటియు" ఆధ్వర్యంలో నగరంలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో మాట్లాడిన వక్తలు ప్రపంచీకరణ విధానాలు, ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలతో మహిళలు దుర్భర



పరిస్థితులను ఎదుర్కోవల్సి వస్తోందన్నారు. రోజుకు సుమారు 17 మంది మహిళలు హత్యకు గురవుతున్నారని చెప్పారు. మహిళలకు శ్రమకు తగ్గ వేతనం లభించడం లేదన్నారు. పెరుగుతున్న నిత్యావసర వస్తువుల ధరలకు తోడు విద్యా, వైద్యం, తదితర ఖర్చులు పెరిగి తద్వారా మహిళలు తీవ్ర ఒత్తిడిలకు గురికావాల్సి వస్తోందని తెలిపారు. సుప్రీం ఇచ్చిన నిర్దేశాలను అమలుపరచ్చడంలో ప్రభుత్వం విఫలం అయ్యిందని విమర్శించారు. మహిళలకు చట్ట సభల్లో రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెడతామని వాగ్దానం చేసిన యుపిఎ ప్రభుత్వం నేటికీ తన వాగ్దానాన్ని నిలుపుకోలేదన్నారు. ప్రభుత్వం మద్యం షాపులను విచ్చలవిడిగా పెంచుతోందని పేర్కొన్నారు. సమాజ ఉత్పత్తిలో కీలక పాత్ర పోషిస్తున్న మహిళలకు సమాన గౌరవం లభించడం లేదన్నారు. పెరుగుతున్న ధరలను నియంత్రించి, రేషన్‌షాపుల ద్వారా నిత్యావసర వస్తువులు సరఫరా చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో ఐద్వా నాయకులుకె.స్వరూపరాణి, టి. జ్యోతి శ్రామిక మహిళా నాయకురాలు పి. రోజా, సిఐటియు నగర కన్వీనర్ పద్మశ్రీ, ఐద్వా నగర కార్యదర్శి ఛల్లా లీలావతి తదితరులు పాల్గొన్నారు.

అంతర్జాతీయ మహిళాదినోత్సవం సందర్భంగా33శాతం రిజర్వేషన్, ప్రజాపంపిణీని పటిష్టంచేయాలని, నిత్యావసర వస్తువుల ధరలను నియంత్రించాలని, కనీస ఉమ్మడి ప్రణాళిక లోవున్న అంశాలను అమలు చేయాలని కోరుతూ అన్న జిల్లాలలో సదస్సులు, ధర్నాలు జరిగాయి.

గుంటూరులో ప్రజాపంపిణీ వ్యవస్థ పటిష్టం చేయాలని, ఇళ్ళ స్థలాలు ఇవ్వాలని కోరుతూ ఎం.ఆర్.ఓ ఆఫీస్ ముట్టడి జరిగింది. ఈ సందర్భంగా పోలీసులు లాఠీచార్జి చేసి నాయకులను అరెస్టు చేశారు. అందులో రాష్ట్ర ఉపాధ్యక్షురాలు రమాదేవి, జిల్లా కార్యదర్శి అనిల అరెస్టయినవారిలో ఉన్నారు.

**సామాజిక చైతన్య యాత్ర:** బాబు జగ్జీవన్‌రామ్ జయంతి ఏప్రియల్ 5 నాడు ఆరంభమైన సామాజిక సైకిల్ యాత్ర అంబేద్కర్ జయంతి ఏప్రియల్ 14న ముగిసింది. అంటరానితనం, కులవివక్షతను నిర్మూలించాలని, ఎస్సీ, ఎస్టీ కమీషన్ వేయాలని, భూమి లేని నిరుపేదలకు 3 ఎకరాలు భూమి ఇవ్వాలని, దళితులపై జరుగుతున్న వేధింపులను అరికట్టాలని రాష్ట్ర వ్యాప్తంగా 76 ప్రజా సంఘాలు పల్లెలు, పట్టణాల్లో సైకిల్ యాత్రను నిర్వహించారు. అందులో ఐద్వా కూడా అన్ని జిల్లాల్లో పాల్గొంది.



**ఇంటి పని వారల సంక్షేమ సంఘం:-** ఏప్రియల్ 1వ తేదీ నుండి 17వ తేదీ వరకు రాష్ట్ర వ్యాప్తంగా మున్సిపల్ పట్టణాలలో ఇంటి పని వారల సమస్యల పై సర్వే, సదస్సులు లేబర్ ఆఫీసుల వద్ద ధర్నాలు జరిగాయి. రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో హైదరాబాద్ లేబర్



కమీషనర్ వద్ద 500 మందితో ధర్నా జరిగింది. రాష్ట్ర కన్వీనర్ టి. జ్యోతి, ఇంటిపనివారల సంఘం నగర అధ్యక్షురాలు బి. చెన్నమ్మ, ఐద్వా రాష్ట్ర ఉపాధ్యక్షురాలు సి. అరుణ, రంగారెడ్డి జిల్లా కార్యదర్శి విజయ ధర్నాను ఉద్దేశించి ప్రసంగించారు.

**రాష్ట్ర సదస్సు:** స్నేహ ఇంటిపనివారల సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో బి. చెన్నమ్మ అధ్యక్షతన సుందరయ్య కళానిలయంలో రాష్ట్ర సదస్సు జరిగింది. ఎంత కష్టం చేసిన తప్పని వేధింపులు, తక్కువ వేతనాలు, పని భద్రత లేకపోవడం, అనారోగ్య సమస్యలు, చిన్న చూపు చూడటం, నేరాలు ఆరోపించడం, అంటరాని తనం వంటి సమస్యలతో ఎన్నో ఇబ్బందులు పడుతున్నామని వివిధ జిల్లాల నుండి వచ్చిన ఇంటిపనివారలు ఆవేదన వెలిబుచ్చారు. ఈ సభలో ఎం.ఎల్.ఎ నోముల నర్సింహ్మయ్య, రాష్ట్ర కన్వీనర్ టి. జ్యోతి, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి స్వరూపరాణి, సి.ఐ.టి.యు రాష్ట్ర ఉపాధ్యక్షులు అజయ్ కుమార్ ప్రసంగిస్తూ సమస్యలపై ఐక్య ఉద్యమాల ద్వారానే సమస్యలు పరిష్కారం అవుతాయని సంఘటితంగా పోరాడాలని పిలుపు నిచ్చారు. రాష్ట్ర కన్వీనరు జ్యోతి వివిధ డిమాండ్సుపై తీర్మానం ప్రవేశ పెట్టారు. వివిధ జిల్లా నుండి హాజరైన నాయకులు సభలో ప్రసంగించారు. సదస్సులో బి. చెన్నమ్మ, టి. జ్యోతి అధ్యక్ష, కార్యదర్శులుగా 25 మందితో కమిటీ ఏర్పడింది.

**మధ్యాహ్న భోజన నిర్వాహకుల సంఘం:-** మే 3వ తేదీన



మధ్యాహ్న భోజన నిర్వాహకుల సంఘం రాష్ట్ర వర్క్‌షాప్ రమాదేవి అధ్యక్షతన జరిగింది. మిడ్డే మిల్స్ వర్కర్స్ సమస్యల పరిష్కారం కొరకు నిరంతర ఆందోళన చేయాలని పిలుపు నిచ్చింది.

**ఐద్వా, డివైఎఫ్ఐ వినూత్న నిరసన:**

హైదరబాద్‌లో ఐద్వా, డివైఎఫ్ఐ నగర కమిటీల అధ్వర్యంలో బస్టాప్‌ల వద్ద బస్ షెల్టర్‌లను ఏర్పాటు చేయాలని వినూత్న పద్దతుల్లో గొడుగులు పట్టుకొని ప్రయాణికులకు నీడనిచ్చి ప్రభుత్వానికి నిరసన తెలిపారు. నగరంలో మొత్తం 1700 బస్టాపులు ఉండగా అందులో 300 స్టాపులకు అసలు షెల్టర్లు లేవని కొన్ని పేరుకు మాత్రమే ఉన్నాయని ప్రయాణికులు ఎండకు, వానకు నానా అవస్థలు పడుతున్నారు. ఈ కార్యక్రమంలో ఎం.ఎల్.సి కె. నాగేశ్వర్ గారు ప్రసంగిస్తూ గ్రేటర్‌గా రూపాంతరం చెందినా బస్టాపుల వద్ద షెల్టర్‌ని ఏర్పాటు చేసుకోకపోవడం శోచనీయం అన్నారు. వెంటనే బస్ షెల్టర్ ఏర్పాటు చేయాలని ఐద్వా నగర కార్యదర్శి చల్లా లీలావతి, డివైఎఫ్ఐ నాయకులు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

## కట్నం కోసం వేధిస్తున్న భర్త, అత్తమామల అరెస్టు కోరుతూ...

**వేధింపులపై బేగం కథనం:** చిత్తూరు జిల్లా చంద్రగిరి మండలం గొల్లవాని కాలువ గ్రామానికి చెందిన మండలం గొల్లవాని కాలువ గ్రామానికి చెందిన షేక్ గౌసియా బేగంకు ఇబ్రహీంపట్నం గ్రామానికి చెందిన ఎం.డి.బషీర్‌తో 2002 ఆగస్టు 11న వివాహం జరిగింది. ఆ సందర్భంగా రెండు లక్షల రూపాయల నగదు. 26 కాసుల బంగారం బషీర్‌కు కట్నకానుకల కింద ఇచ్చారు. బషీర్ దుబాయ్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావడంతో బేగంను అక్కడికి తీసుకెళ్లాడు. రెండున్నర సంవత్సరాలు వీరి కాపురం సజావుగానే సాగింది. 2005లో బేగం అత్త, మామలు షేక్ జుబేదాబేగం, ముస్తాన్ సాహెబ్ దుబాయ్ వెళ్లారు. బేగంను ఇటీవల దుబాయ్ నుండి ఇబ్రహీంపట్నం తీసుకువచ్చిన భర్త, ఇక్కడ బేగం అత్తమామల వద్ద ఉంచి వెళ్లిపోయారు. పుట్టింటి నుండి రెండు లక్షలు తీసుకురావాలని బేగంను మానసికంగా శారీరకంగా భర్త, అత్తమామలు వేధించారు. దీంతో బాధితురాలు



స్థానిక పోలీసులకు ఫిర్యాదు చేసింది. ఈ నేపథ్యంలో ఈ నెల 22వ తేదీన బేగంతోపాటు భర్త, అత్తమాము ఉమెన్ ప్రొటక్షన్ సెల్‌లో కౌన్సిలింగ్‌కు వెళ్లారు. కౌన్సిలింగ్‌లో ఇద్దరి మధ్యా సఖ్యత కుదరనందున అదే రోజు రాత్రి పోలీసులు భర్త, అత్తమామలపై క్రైం నెం. 59/07 అండర్ సెక్షన్ 498 (ఎ), సెక్షన్ 3 వరకట్న నిషేధ చట్టం కింద పోలీసులు కేసు నమోదు చేశారు. అయితే పోలీసులు నిందితులకు సహకరిస్తూ కేసును పట్టించుకోవడం లేదు. ఎస్ఐ అవినీతికి పాల్పడి నిందితులు తప్పించుకుని వెళ్లేందుకు సహకరించారని బేగం ఆరోపిస్తోంది.

కట్నం కోసం వేధింపులకు గురిచేసిన భర్త, అత్తమామలను వెంటనే అరెస్టు చేయాలని, నిందితులకు సహకరిస్తూ అవినీతికి పాల్పడిన ఎస్ఐ ఆర్.గణేష్ జయసూర్యను సస్పెండ్ చేసి బాధితురాలికి న్యాయం చేయాలని డిమాండ్ చేస్తూ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) మండల కమిటీ ఆధ్వర్యంలో స్థానిక పోలీసు స్టేషన్ ఎదుట ధర్నా నిర్వహించారు. డాక్టర్ జాకీర్ హుస్సేన్ డిగ్రీ కళాశాల విద్యార్థినులు, మహిళలు పాల్గొన్నారు. రాష్ట్ర మహిళా కమీషన్‌కి రిపోర్టు చేశారు. ఐద్వా ఆందోళన ఫలితంగా ఎస్.ఐ జయసూర్యను ట్రాన్స్‌ఫర్ చేశారు. ముద్దాయిలను అరెస్టు చేసి రిమాండ్‌కి పంపారు. రాజ్యాంగం ప్రసాధించిన సమన్యాయ సూత్రానికి అణుగుణంగా, దేశ వ్యాప్తంగా మహిళలందరికి సమాన హక్కులు, సమాన చట్టాలు వర్తింపజెయ్యాలని కోరుతున్నాము. ముస్లిమ్ పర్సనల్ లా లో అవసరమైన సంస్కరణలు జరగాలని జరుగుతున్న పోరాటానికి సంపూర్ణ మద్దతు తెలియజేస్తున్నాము.

### సంతకాల సేకరణ

ముస్లిమ్ మహిళల పట్ల వివక్షతా పూరితంగా వున్న ఈ క్రింది అంశాలను, పరిగణలోకి తీసుకోవాలని కోరుతూ సంతకాల సేకరణ జరుగుతుంది.

1. మూడు సార్లు తలాక్ ఉచ్చరించి, ఏక కాలంలో భర్యను వదిలించుకోవడంతోపాటు, అమలులో వున్న బహుభార్యత్వాన్ని కూడా నిషేధించాలి.

2. తండ్రితోపాటు తల్లికి కూడా పిల్లల సంరక్షణ, ఆదీనంలో ఉంచుకొనే హక్కు కల్పించాలని కోరుతూ... దేశ వ్యాప్తంగా లక్షలాది సంతకాలు సేకరించి జాతీయ ముస్లిం మైనార్టీ కమీషన్‌కి అందజేయాలని ఇచ్చిన పిలుపులో బాగంగా సంతకాల సేకరణ జరుగుతున్నది.



**ఇళ్ళస్థలాల సాధనకై పోరాడుతున్న పేద ప్రజలపై దాడులు ఆపి పేదప్రజలకు వెంటనే ఇళ్ళస్థలాలు మంజూరు చేయాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్ ఐద్వా సిటీ కమిటీ ఆధ్వర్యంలో సంతకాల సేకరణ**

# ఐద్వా ప్రచురణలు




వెల: 5-00




వెల: 10-00




వెల: 10-00




వెల: 8-00




వెల: 80-00




వెల: 40-00

## పై పుస్తకములు దొరుకు చోటు

**ఐద్వా, 1-8-538/4, ఒడియన్ థియేటర్ దగ్గర, చిక్కడపల్లి, హైదరాబాద్-20**

**ఫోన్: 27605845, ప్రజాశక్తి బుక్ హౌస్.**

# దళిత సూర్యుడా... భాస్కరుడా...



ఆది నుండి అంటరానొళ్లై
ఊరికి దూరంగా తర్మబడి
బానిస బతుకుల్లో అల్లాడి
దిక్కు దాపు లేక చిల్లాడిన

దళితుల దాసత్వం నుంచి
విగత జీవుల చెదిరిన బ్రతుకుల్లోంచి
మోడువారిన బీడు బ్రతుకుల్లో
చిగురించిన వెలుగు రేఖ.....అంబేద్కర్!

ఎట్టి నిర్మూలనకై కులం తుట్టెను కూల్చి
మనుషులను పోగుచేసి మనువాదం తగలేసి
బోధించి, సమీకరించి, పోరుబాటను చూపిన
కలియుగ దళిత ప్రవక్త...అంబేద్కర్!

అడుగంటిన వర్ణంలో చైతన్య దీప్తి రగిలిస్తూ
మనువాదుల గుండెల్లో కంటకమై నిలుస్తూ
కడవరకు కడజాతి మేలెంచిన
దళిత సూరుడా..... భాస్కరుడా!!

నీ ఆశయమే మా గమ్యం
సాధించుటే మా ధ్యేయం
మీ నీడలలో మీ జాడలో
పయనించే ఈ యువతరానికి నీవే ఆదర్శం
నీ మార్గం చైతన్యామృత కలశం!!!

- జె. గంగయ్య

| | |
|---|---|
|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A120 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 9/08/23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | లేవు |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hema |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |